సీలుఅన్నరు
మడలను
ప్రీమియర్‌బాంకిలో

బహుమతి రూ 10,000
MURALI CROSS WORDS
మురళి 1,2, కాసువ ఛేసు
GOVT REGD NO 1894

ముగింపుతేదీ
25-4-52

వరుస 1కి
నాలుగు
అణాలు

మొదటి బహుమతి రూ.7000

MURALI

ఇతర బహుమతి రూ.3,000

## Closing Date 25-4-52 (Subject to Rules and Conditions.)

| | | జవాబులు 1 | 2 |
|---|---|---|---|
| 1 | పోటీదారుల——ను మురళి క్రాసువర్డ్సు అభినందించును | ఉత్సాహము | ప్రోత్సాహము |
| 2 | మహిళల ప్రేమ ఇలాంటిదని కొంతమంది పండితులు శెలవిచ్చారు | చటులము | చంచలము |
| 3 | పురుషులమాటలు ఇలాంటివేనని స్త్రీలు విమర్శిస్తారు | బూటకము | నాటకము |
| 4 | ఈ రోజులలో హిందువుల వివాహమునకు ఇది అవాంతరము కారాదు | గోత్రము | కులము |
| 5 | తనభర్త——ని చేపట్టినప్పటికిన్ని గౌరవముతో సంచరించు భార్యలు చాలామందియున్నారు | యువతి | సవతి |
| 6 | దీని బారిపడితే జీవితంపై విరక్తి జనించే అవస్థకూడా రావచ్చు | దారిద్ర్యము | మోహము |
| 7 | కలవారికి లేనివారికి మధ్యయేర్పడిన——ను తొలగించుట ప్రభుత్వముల ముఖ్యవిధి | విద్వేషము | విభేదము |
| 8 | అదృష్టము అనుభవముయున్న యెడల దీనిద్వారా నేడు మంచిడబ్బు సంపాదించవచ్చును | వ్యవసాయము | వ్యాపారము |
| 9 | ఇదిలేనిది మంచి రాత్రిపూట యెచ్చటికైనను వెళ్లుదురా? | కార్యము | ధైర్యము |
| 10 | దురాశకు తావిచ్చువారు సాధారణముగా దీనికి లోనగుచుందురు | శ్రమ | భ్రమ |
| 11 | కన్నె చెరవిడిపించుటకై యెంతమంది తండ్రులు దీనిని కప్పిపుచ్చుకొనలేదు | రోషము | ద్వేషము |
| 12 | సహజముగా వీరినిగురించి కొంతమందెక్కువ తెలుసుకొనుటకు ప్రయత్నిస్తారు | సన్మార్గులు | దుర్మార్గులు |
| 18 | సినిమాపరిశ్రమయందు విజయము ఇతనిపైననే నాధారపడియున్నదని చాలామంది అభిప్రాయం | దర్శకుడు | నటకుడు |

మీ జవాబులు ఈ ఇండ్లయందు 1.2 మూలముగాపూర్తి చేయుడు

1
2
3
4
5
6
7
8
9
10
11
12
13

పైనుండికిందవరకు జవాబులవరుస 1కి 4 అణాలుమాత్రం రూపాయికి 5 వరుసలపూర్తి చేయుడు

2
2
2
1
1
2
1
2
2
1
2
2
1

పేరు..................................................................................................

అడ్రసు..................................................................................................

P. O. or M. O. No.........Col No.......... మొత్తము రూ........ మొత్తం వరుసలు..........................

In entering the Competition I agree to abide by the Competition Rules & Conditions and to accept the Competition Manager's decision as final and legally binding.

**No. 10**

*Address Entries to:* **MURALI CROSSWORDS, PALMANER.** (CHITTOOR DIST)

# SQUAREWORD No. D–2




RUNNERS UP– Rs.10,000

EXTRA PRIZES FOR ALL ENTRANTS WITH UNDER FIVE ERRORS

## CLUES DOWN

1 We're more likely when we're young than when we're old to respond —— to offers of friendship
2 Bustle tumult
3 Falsehood
4 Man's having —— outwitted us in deal usually makes us much more careful in future deals with him
5 When man becomes —— he sometimes has little time for his former pals
7. It's apt to undermine discipline when subordinates know that those in authority —— each other
11 It's apt to put us on our guard when canvasser starts conversation by telling us he is ——
13 Marriage often cures man of being ——
14 Self-made man is sometimes surprisingly —— about his past
16 It often causes quarrels in the home when wife has —— ideas on running it
17 Man who lacks —— seldom goes far in job that calls for it

# CLOSING DATES

(Subject to Rules and Conditions)

**4 p.m. THURSDAY, Nov. 6, for Local Entry Boxes**

**6 p.m. TUESDAY, Nov. 11, for posted entries**

**ADDRESS ENTRIES TO**

**Squareword No. D–2, Delhi Express, Mori Gate, Delhi.**

For full details see Delhi Express of Oct. 18, 25 and Nov. 1.

CUT ALONG THIS LINE

CUT HERE ........ **ENTRY FORM FOR SQUAREWORD No. D–2** ........ CUT HERE

The Entry Form must be submitted intact, and in the name of only one person. Unused Squares must be left blank. Pencil entries are not allowed. Every two Re 1/- Squares entered entitle the person entering them to one Half-Fee Square. No person who enters only one Re 1/- Square is entitled to a Half-Fee Square. Re 1/- Squares and Half-Fee Squares must be numbered separately. For instance, if you enter four Re 1/- Squares and two Half-Fee Squares number Re 1/- Squares, 1, 2, 3, and 4, and number Half-Fee Squares 1 and 2.




Re. 1/- SQUARE No.......... D-2

FOLD HERE




Re. 1/- SQUARE No .......... D-2

FOLD HERE




HALF-FEE SQUARE No.......... D-2

**D—2** In entering this Competition I agree to abide by the Competition Rules & Conditions and to accept the Competition Editor's decision as final and legally binding.

SURNAME in ink and Block Letters ............ Mr / Mrs / Miss ............ INITIALS ............

FULL ADDRESS ............

I ENCLOSE HEREWITH Money Order Receipts / Squareword Receipts / Postal Orders ............ Nos.

CUT HERE ...... CUT HERE ...... CUT HERE

CUT ALONG THIS LINE

# కాలిపోయిన కారణం

(15 వ పేజీ తరువాయి)

అంతగా పట్టింపులో వుండవు. ఆడదాని విషయంలో ఇది మహాఘోరం. ఒక ఆడపిల్ల తల్లి పై దుర్భరావస్థలోనో ఇల్లు విడిచిపోతే ఆ తప్పు—తప్పయినా కాకపోయినా—అది వీరి దృష్టిలో మహా తప్పుగానే లెక్క. కనుక, ఆ తప్పు ఈ నోరులేని అమాయక బాలికకు కూడా చెందుతుంది. ఈమె పెరిగి పెద్దదై వివాహప్రయత్నంచేస్తే—"దీనికి పెళ్ళా? దీని తల్లి కులట? ఇలాంటి కులట కూతుర్ని కట్టుకోవడానికి అంత బుద్ధిలేనివాడు ఎవడు?' ఇటువంటి మాటలు లక్షలు

ప్రతివాడు తల్లి తప్పుకు బిడ్డను హీనపరచి, గుండెల్ని చీల్చి—అందుపై ఇంత కారంకూడ చల్లి అంతవరకూ సౌశీల్యవతిగా వున్నా-ద్వేషాన్ని-హేయాన్ని ఆ లేత గుండెల్లో నాట ప్రయత్నిస్తారు. అట్టి స్థితే ఇకమీద తన ముద్దుబిడ్డకు ఏర్పడుతూంది దానికి తిరుగులేదు తప్పించేందుకు మార్గం? డబ్బు చాటున ఎన్ని కళంకితాలనైనా తప్పిపెట్టవచ్చు కాని—ఒక్క కానికికూడా తాను కొఱగాని విధంగా వుంది మరి ముందు ఏందారి? తన రక్తంలో రక్తం—తన హృదయాని కింత కాంతి—ప్రేమానురాగాలకు ఆలవాలం అయిన తన బిడ్డ రజని జీవితాన్ని తను బ్రతికి వుండి—కళ్ళముందు ఆ అమ్మాయి కూడా ఇలాంటి అసమర్థుని కడుపున పుట్టినందుకు లోలోన ఏడుస్తూ—సంఘంలో—"ఇది లేచిపోయినదాని కూతురు! ఇది లేచిపోయినదాని కూతురు!" అంటూ హేళన చేయించుకుంటూ — ఆశ్రయహీనయై అధమ మార్గాన్నే బ్రతుక నిశ్చయించుకుంటే—చూస్తూవుండవలసే వుంటుందే!

ఎంత ఘోరం!—తాను కష్టాలు పొందాడు. అంతకన్నా హీనమైనట్టు తన బిడ్డ బ్రతుకవలసి వస్తూంటే తాను దానిని తప్పించే ప్రయత్నం చేయవద్దా? అది తన కర్తవ్యం. తను కన్నందుకు తన బిడ్డ మంచికి తగు మార్గం అన్వేషించడం గురుతరమైన కర్తవ్యం. ఇక ఆలోచనలకు తావు లేదు. వెనుక ముందులు చూడకూడదు. ఒకటే—ఒకే ఒకటి మార్గం. ఆ మార్గాన్ని అనుసరించదలచి లేచి నిలిచాడు.

తెల్లవారి ప్రతివారి నోట—"వీడి పెళ్లాం లేచి పోయింది." అని తన్ను చూచి—"దీని తల్లి లేచిపోయింది" అని తన బిడ్డను చూచి లోకులు ఎగతాళి చేయకుండానే ఆ రాత్రికి రాత్రి తన నిశ్చయాన్ని సఫలీకృతం చేసుకోదలిచాడు.

భార్య పోయిందని తెలుసుకున్న క్షణంలోనే కొంత వున్మత్తతవానిలో పొడచూపింది అది క్రమక్రమంగా పెరిగిపోయి వికటాట్టహాసం చేసింది. మనిషి మనిషిలో లేడు చరచర బయటకు నడిచాడు. అప్పటికీ దీపావళీ జ్యోతుల వైపే దృష్టితో ఇతరం మరచి లీనమైయున్న రజని ప్రక్కకు పోయి పిలిచాడు తాను ఒకసారి వూరును చూశాడు ప్రతియింట పండుగ! దీపహీనమైన గృహ మొక్కటీ కంటిముందు లేదు. వెనుదిరిగి చూచాడు తన యిల్లు-తన యిల్లు ఒక్కటే వూరుకు దూరంగా-దీపహీనమై-దారిద్ర్యదేవత ఆవాసంగా తోస్తోంది—అందరి యిండ్లలోనూ ఏ కలిగిన కొద్దిలోనో పండుగ చేసుకుంటున్నారు. పెద్దవాళ్ళు ఏమైనా చిన్న పిల్లలకు సంతోషాన్ని కూర్చేందుకు ప్రయత్నించారు మరి తానో! తన బిడ్డ కట్టగుడ్డకే పొట్టకూటికే మొగమాచి వుంది ఇలాంటి దౌర్భాగ్యులకు ఇక నేం పండుగ? అకస్మాత్తుగా ఆలోచనలనించి తేరుకుని—బిడ్డ తలపై చేయి వేశాడు. త్రుళ్ళిపాటుతో జాలిగా తండ్రి ముఖంలోకి చూచింది రజని దూరాన వెలిగే వెలుగుల ఛాయల్లో అస్ఫుటంగా కనిపించింది తండ్రిముఖం.

"నాన్నా!"

"ఏమమ్మా!"

"అలా వూళ్ళోకి వెళ్ళి వద్దాం రా నాన్నా!"

"ఎందుకమ్మా!"

"వాళ్ళు కాలుస్తున్న మందుల్ని చూచివద్దాం నాన్నా!" గుండెలు కదలిపోయాయి కన్నులు ఏరులై పారాయి పొంగులువారే దుఃఖం గొంతుకు అడ్డుపడుతూండగా—'వద్దు రజనీ! మనం ఆ విలాసాలను చూడవద్దు మనకు ఆ భాగ్యం లేదు. మనల్ని వారు చాలా హీనంగా చూస్తారు తల్లీ!—రా! లోనకు పోదాం. ఇక ఇలాంటి లోకంలో మనలాంటి నిర్భాగ్యులు బ్రతకకూడదు' అన్నాడు

తండ్రిని వాటేసుకుంది రజని. 'పోనీ, కాని నాన్నా! అమ్మ ఏదీ! ఎక్కడికు వెళ్ళింది?' అమాయకంగా అడిగింది ఆ అమ్మాయి.

"అమ్మ! అమ్మ!!—అమ్మ మన పూరి కొంపలో—కటిక చీకట్లో వుండలేక—ఆనందించేందుకు వెళ్లిందమ్మా!"

"ఎక్కడికి నాన్నా! అమ్మను చూడాలి. న కూడా అమ్మ దగ్గరకు తీసుకుపో నాన్నా! తల్లి జ్ఞాపకంతో ఆమె గుండెల్లో సుళ్ళు తిరిగా బిడ్డను చూడలేకపోయాడు అతడు. మె చేయి పట్టుకుని ఇంటిలోనకు తీసుకుపోయి

వులు బిగించాడు—అలా తీసుకుపోతూ తానుగా—"రజనీ! ఏడవకమ్మా! ఆ ఇక లేదు. రేపటికి మనం పూర్తిగా వుండం ఇంతసేపూ, వూరువాళ్ల దీపాలతో ఇళ్ళు న రించుకుని—ఆనందోత్సవాన్ని కాంచుకున్నా దూరానికి ఆ దీపమాలలు కొంచెం కొం యిచ్చాయి మనకి ఇక యిప్పుడు మనం దీప వుత్సవాన్ని చేసుకుందాం. ఈ వెలుగు వూరంతకీ దివ్యమైన తేజస్సునిస్తుంది. ఇ పెద్ద జ్యోతిని వాళ్ళు ఏ దీపావళీనాడూ వెలి లేరు. మనం ఎంత బీదవాళ్ళమైనా అంతటి జ్యోతిని వెలిగించగలం." అన్నాడు. వికృ వాని నించి నవ్వులు వెలువడ్డాయి.

పావుగంట గడచి వుంటుంది. అభాగి పూరిల్లు పొగలు వెలిచిమ్మి భగ్గున మండి ఆ మంట దివ్యప్రకాశమై గ్రామస్థులను ఆ వించింది అంతకంతకూ మంటలో "పెటేల్-పెటేల్"మనే శబ్దాలు లోనవించి వికటహాసం చంటిదాని ఏడ్పు. ఆ ఏడ్పును బలంగా ఏ వ్య అధికట్టుతూన్నట్లు తోచింది. ఊరువారు మంట ఆరికట్టే ప్రయత్నంలోనే వున్నారు. లోన తం బిడ్డలు మలమల మాడి ప్రాణాలు గోలుపోవ పూర్తికానే అయ్యింది

ఒక గంటకు మట్టిగోడలు మాత్రం నిలిచా అక్కడచేరినవారు—ఆ గృహదహనంలో ప జించినవారు మ్రుగ్గురనుకొన్నారు. ఇల్లు అం కొని తగలబడిపోవడానికి కారణం ఏ హవ్వాం చువ్వో అయివుండవచ్చునని చాలా ఆవేదనను సానుభూతిని ప్రదర్శించారు.

బ్రతుకుభారమై—తన బిడ్డ దుర్గతి పా కాకుండేందుకు అభిమానంతో ఆ భాగ్యరా స్వయంగా తన కొంపను తానే కాల్చుకొని-ఆ పవిత్ర అగ్నిహోత్రానికి తమ ఆత్మార్ప గావించుకొన్నాడని అందులో ఏ ఒక్క వ్య ఊహించనైనా ఊహించ లేక పోయాడం ఆశ్చర్య మేముంది?

అభాగ్యుని జీవిత చరిత్ర అగ్నిలో కా మసి నుసియై అంతరించినట్టే-అసలు కారణ అగ్నిలోనే కాలి మసియై మట్టిలో కలసిపోయిం

Edited, Printed and Published by
NARLA VENKATESWAR RAO
at the "Indian Express" Press, Express Estate, "CLUBHOUSE", Mount Road Madras.

# దేశోద్ధారకుని 14 వ వర్ధంతి



విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు శివసాన్నిధ్యం పొంది ఈ చైత్రశుద్ధ ద్వాదశికి పద్నాలుగు సంవత్సరాలు గడిచింది.

పంతులుగారి జీవితచరిత్ర ఆంధ్రదేశ చరిత్రలో ఒక ప్రత్యేక స్థానమని చెప్పవలసి ఉంటుంది. 1914 లో ఆంధ్రపత్రిక మద్రాసులో వెలసిన నాటినుంచే ఆంధ్రులకు 'ఆంధ్రులనే' నామం ఏర్పడింది. అంతకు పూర్వం 'ఉత్తరాదివారు' 'తెలుంగువాళ్లు' అని మాత్రమే ఆంధ్రులు వ్యవహరింపబడేవారు. ఆంధ్రులంటే ఒక విధమైన అగౌరవభావం కూడా దాక్షిణాత్యులకుండేది. అట్టి పరిస్థితిలో ఆంధ్ర శబ్దానికి ప్రాణం పోశారు పంతులుగారు. 1914 లో ఆంధ్రపత్రిక మద్రాసులో స్థాపింపబడినది మొదలు ఆంధ్రజాతిలో నూతన చైతన్యం ఉద్భవించింది. ఆంధ్రదేశంలో ఏ ఉద్యమం ప్రారంభమైనప్పటికీ దానికి ఆంధ్రపత్రిక చేయూతనిచ్చింది. పంతులుగారు కూడా ప్రతిసంస్థకు, ప్రతి ఉద్యమానికి అండగా నిలబడేవారు. ఆంధ్రులు నెలకొల్పిన బ్యాంకు వ్యాపారాలు మొదలుకొని గ్రంథాలయాల వరకూ, శైవ మహాసభలు మొదలుకొని హరిజన సభలవరకూ పంతులుగారు అధ్యక్షత వహించారు.

అన్నివర్గాల వారికీ ఆదరణీయులై ఆదర్శప్రాయులై ఆంధ్ర నాయకు లందరిలో ఒక్క ప్రత్యేకత మీరగ నిర్వహించిన మహాపురుషుడు పంతులుగారు. ఆధ్యాత్మికానికీ పారమార్థికానికీ సమన్వయమార్గం చూపి, [illegible] ఐశ్వర్యం పెట్టకుండా ఖర్చుపెట్టిన ఉదార స్వభావులు. అటువంటి పుణ్యపురుషుడు ఆంధ్రదేశంలో నభూతో నభవిష్యతి అని చెప్పక తప్పదు. ఆయనకు దేశోద్ధారక నామధేయాన్ని ఆంధ్రమహాసభ ఇచ్చింది. విశ్వదాత నామాన్ని [illegible] ఇచ్చారు. కళాప్రపూర్ణ బిరుదాన్ని

ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారిచ్చారు. ఆయన స్థిరస్థాయిగా దేశాని కిచ్చిన ఆంధ్రపత్రిక, సచిత్ర వారపత్రిక, భారతి, విజ్ఞాన సర్వస్వము, ఆంధ్ర వాఙ్మయ చరిత్ర ఆంధ్ర సాహిత్య చరిత్రలో నూతన శకాన్ని తెచ్చాయి.

ఈరోజున ఆంధ్ర రాజకీయ రంగం వివిధ నాయకుల వైషమ్యాలూ, పరస్పర స్పర్ధలతో సమశృతి లేకుండా ప్రవర్తిల్లుతున్నది. కాని ఇప్పుడున్న నాయకులే శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి జీవిత కాలంలో అపశృతి లేకుండా ఐక్యభావంతో రాజకీయసమరం సాగించ గలిగారు. పంతులుగారి నాయకత్వాన్ని ఆనాడు ఆంధ్ర నాయకు లందరూ శిరసావహించారు. ఆంధ్ర దేశ నాయకత్వం వహించడానికి అవసరమైన జనవశీకరణశక్తి, కార్యదక్షత ఆయనలో ఉండడంవల్లనే దేశోద్ధారకు లనిపించుకున్నారు. ఈ మహాపురుషుని పుణ్యదినం ఆంధ్ర జాతి ఉన్నంతకాలం పర్వ దినంగా పరిగణింప బడగలదు.



# ★ మద్రాస్ డైరీ ★

## ధరల కోతలు

పోయిన వారంలో అంటే సంవత్సరాది వచ్చిన వారంలో చెన్నపట్నం బజారులో బట్టల ధరలు తగ్గాయని పండక్కి కొత్త బట్టలు కొనుక్కోగల తాహతున్నవాళ్లు అనుకున్నారు. తగ్గినట్టు పైకి కనపడ్డమే కాకుండా నిజంగా తగ్గాయి కూడా—కొద్దిగా. చీటీలమీద ధరలకి మాటికి అరుంపావు మొదలు పన్నెండున్నర వరకూ కోతకోసి (డిస్కౌంట్ ఇచ్చి) చీరలు, గుడ్డలూ అమ్మారు. అయితే చీటీలమీద రాసిఉన్న ధరలు 'కోతలకి' ముందు నిజంగా ఉన్నవో లేకపోతే 'కోత కోసం పనిగట్టుకుని 'కోత' మేరకి పెంచి రాసినవో తెలియదు. బకింగ్‌హామ్ ఎండ్ కర్నాటిక్ మిల్స్ గుడ్డలుమాత్రం పాత ధరలకే అమ్మారు. ఇదివరలో క్యూలో గంట సేపు నుంచుని, కాళ్లు నొప్పిపుట్టించుకుని, దుకాణదార్ల చేత కసిరించుకుని చీటీలూ రసీదుల తికమకల్లోంచి బైటపడితే రెండు గజాలు మాత్రమే! లేక ఒక్కొక్క ముక్క మాత్రమే (తువ్వాళ్లు వగైరా) దొరికిన బిన్నీ గుడ్డ చీకటిఘోషానించి బైటపడి దుకాణాల్లో వెలుగుచూసింది. ఆ గుడ్డల కుప్పలు చూసేసరికి కొన్నంత కడుపు నిండింది.

అయితే ఈ 'కోత' లెంతకాలం నిలుస్తాయో తెలియదు. ఓ పెద మిల్లు యజమానుల ఘోషా ఇంకో పెద్ద ప్రభుత్వపు లెక్కల ఘోషా వింటూ ప్రభుత్వం ఊరుకోలేదు. నిరుడు వస్త్రం ఎగుమతిలో మన దేశమే మిగతా దేశాలన్నిటిమీదా స్వారీ చేసిందట. ఏడాది తిరిగేసరికి మూడు దేశాలొచ్చి మనమీద స్వారీచేసి కూచున్నాయి. ఈ సంవత్సరం అన్ని దేశాలకంటె ఎక్కువ వస్త్రాన్ని ఎగుమతి చేసినది జపాన్. బ్రిటన్ రెండోది. అమెరికా మూడోది. మన దేశం నాలుగులో పడిపోయింది. ఇంక మన ప్రభుత్వం ఎలా ఊరుకుంటుంది? వస్త్రం ఎగుమతిపైన నిర్బంధాల పురి సడలించేసింది. ఇహ మళ్ళీ ధరకి పురెక్కవచ్చు.

*　　*　　*

కాయగూరల ధరలుకూడా కొంత తగ్గాయి. కాని కొత్వాల్ బజారు కెళ్లి కొనేవాళ్ళకి తక్కువ కాకుండా కొనేవాళ్ళకి మాత్రమే ఈ తగ్గుదల ఒంటబట్టింది. తక్కువ కొనేవాళ్లు మిగతా మార్కెట్లకి పోక తప్పదు. ఆ మార్కెట్లలో ధరల తగ్గుదల మహా అయితే రూపాయికి అణా బేడా తగ్గింది. పప్పువస్తువుల ధరలలో పెద్దమార్పు లేదనే చెప్పాలి. కొన్నికొన్నిచోట్ల పడికి అణా బేడా తగ్గాయట కాని చాలాచోట్ల మామూలుధరలకే అమ్మారు. (పెరిగిన రోజుకూడా లేకపోలేదు.) అయితే ధరలు తగ్గడం ఒంటికి ఆశ్టే మంచిదికాదని కాబోలు ఒకచెంప అన్ని 'కోతల్నీ' తుడిచిపెట్టి రెండో చెంప ఖర్చు పెంచెయ్యడానికి నూనెలు, మిరపకాయలు, పసుపు మొదలైన వస్తువుల ధరలు మరోచుట్టు పెరిగిపోయాయి. దీంతో మళ్లీ ధరల తగ్గుదల గురించి తల్చుకోకూడదనిపించింది.

*　　*　　*

## 'కార్యేషు మంత్రి'

రామదాసు గారు శ్రీరామచంద్రుని ప్రార్థించి ప్రార్థించి ఫలితం కానక, చివరికి 'నీవైనా చెప్పవమ్మ' అంటూ సీతాదేవికి మొరపెట్టుకోగానే క్షణం జాప్యం చెయ్యకుండా శ్రీరామచంద్రుడు ఆయన కష్టాలు నివారించారట. నాలుగ్గోడల మధ్య మణిగిపోయేవాళ్లే భార్యలనుకోడం మన సాంప్రదాయం కానేకాదు. భగవంతుడి పేరు చెప్పుకోదలసివస్తే ఫలాని ఆమె పెనిమిటి అంటారు (మాధవుడు అంటే లక్ష్మీదేవికి భర్తయినవాడు అన్నట్లు). రేషనింగ్, కంట్రోళ్లయుగంలో కొండంత బరువున్న సంసార భారాన్ని మోసేభారం నిజానికి భార్యలకి తెలిసినంతగా భర్తలకి తెలియదేమో ననిపిస్తుంది.

అయితే ఆడవాళ్ళూ ఆడవాళ్ళూ కలుసుకున్నప్పుడుమాత్రం అది బయటపడదు. అదంతా మరో వెలుగులో కనపడుతుంది. ఈ కాలంలో నగలూ చీరెలగురించి కంటె 'మీ ఆయనకి జీతమెంత' అనే ప్రశ్న మొదట వినపడుతుంది. ఈ విషయాల్లో ముసుగు విప్పి నిజం మాట్లాడే మగువలు అరుదు. వారివారి చీరెలూ ఆభరణాల్ని బట్టీ అలంకారపు పద్ధతుల్ని బట్టీ భర్తల అంతస్తు కనిపెట్టడం అనుకున్నంత సులువుకాదు.

అయితే రోజులు మారిపోతున్నాయి. నాలుగ్గోడలమధ్య అణిగి మణిగి పోయిన అర్ధాంగులు ముందడుగు వేస్తున్నారు. ఆఫీసర్ల అర్ధాంగులంటే బంట్రోతులపాలిట సవతితల్లులు మాత్రమే ననుకునేరోజులు కూడా వెళ్లిపోతాయి. నెలవారీ ఖర్చుల లెక్కల పుస్తకాలు భర్తలవద్దనుంచి స్వాధీనపరుచుకుంటున్నారు. భర్తల పాటుకి సరైన ప్రతిఫలం ముట్టడంలేదని భర్తల తరఫున గార్డియన్‌షిప్ పుచ్చుకుని వాదిస్తున్నారు. తంజావూరు జిల్లాలో నాన్ గజెటెడ్ ఆఫీసర్ల భార్యలు సమావేశం జరిపి, సెంట్రల్ పేకమిషన్ సిఫార్సుల ప్రకారం హెచ్చు జీతాలూ హెచ్చు భత్యాలూ ఇవ్వాలంటూ తీర్మానాలు చేశారు. తమ భర్తల జీతాలూ భత్యాలూ హెచ్చించుకోడం కోసం తమ అభిప్రాయాల ప్రకటనకు ప్రచారానికీ ఒక పత్రికకూడా పెట్టదల్చుకున్నారట.

*ఎంజీవోలు (నాన్ గజెటెడ్ ఆఫీసర్లు) సమ్మెచేసి ప్రభుత్వంతో నెగ్గలేక కర్మకి తలొగ్గి ఊరుకున్నారు అందువల్ల సత్యభామలాగా ఎంజీవోల అర్ధాంగులు విల్లు సంధించారు.

నిర్వచనం: ఏప్రిల్ ఫూల్—ఏప్రిల్ ఒకటో తేదీని ఉపక్రమించవలసిన పనిని ఏప్రిల్ రెండో తేదీకి వాయిదా వేసే వ్యక్తి.

—ఎస్సార్.





చిత్రకారుడు: యన్. యువరాజ్ (16) పెరంబూరు హైస్కూల్ తెలుగు విద్యార్థి.




ఆచార్య గదిలోకి నేను వెళ్లేటప్పటికి అతను అక్కడ కూర్చుండి ఉన్నాడు. భవిష్యత్తు విప్పి చెప్పగల మహా పండితుడిగా అతన్ని ఆచార్య పరిచయం చేశాడు. తాను సిగరెట్టు వెలిగించి మరొక సిగరెట్టు బికారీ చరణ్‌కి అందిచ్చాడు. ఆ శనివారం సాయంకాలపు చీకటి అప్పుడే దట్టం అవుతూ ఉంది. ఆ గదికి అవతల గుబురుగా పెరిగివున్న చెట్లలో చీకటి అలుముకుంది. బికారీ చెట్లవైపు చీకటిలోనే కూర్చున్నాడు. ఆ చీకటిలో అతడు సిగరెట్టు అంటించడానికి ముఖం చాపితే ఆచార్య అగ్గిపుల్ల వేశాడు. ఆ అగ్గిపుల్ల వెలుతురులో బికారీ ముఖం బాగా కనిపించింది. అతను చూడడానికి విచిత్రంగా ఉంటాడు. వికృతమైన ఆకారం. వయస్సు యాభై సంవత్సరాలు దాటకపోయినా పళ్లు చాలవరకు ఊడిపోయాయి. మిగిలిన కొద్ది పళ్లు నిత్య తాంబూలసేవనంవల్ల గారెక్కి నోరు తెరచినప్పుడు అతని వికారస్వరూపాన్ని మరింత యినుమడింప చేస్తాయి. పై దవడలు చప్పబడిపోయాయి; బుగ్గలు సొట్టపడుతూ ఉంటాయి. నుదురుమీద పెద్ద మడతపడినట్టు ఉంది — జీవితంలో అనుభవాలన్నీ తలలో అకట్టుకున్నట్టు ఎటకారం చేస్తూ ఉంటుంది. కన్నులు రెండూ చిన్నవైనా ఒక కన్ను కొద్దిగా మెల్ల ఉండడం చేత ఎవరికేసి చూచినా ముఖం ఓరగా పెట్టి చూస్తాడు. అలాగ చూసేటప్పుడు తరచు తల ఆడిస్తూ ఉంటాడు. బాగా అలవాటు పడితే తొలిసారి అతన్ని చూచేవాళ్ళకి ఆ వికృతస్వరూపం చూచి భయం వేస్తుంది. ఆచార్య గదిలో ప్రతి సాయంకాలం పది మంది చేరుతూ ఉంటారు. అందులో శనివారం సాయంకాలం వారాంతం సెలవు దినాలు అవడంవల్ల ఆఫీసునించి అలిసి వచ్చినవారికి ఆచార్యగది ఒక ఆశ్రయం - ఆశ్రమం అయింది. ఆ శనివారం కూడా వాడుక ప్రకారం అతనియింటికి వెళ్ళేటప్పటికి యీ విచిత్రవ్యక్తి కనిపించాడు. కాని అపూట జనం ఎక్కువ లేరు. ఆచార్య - నేను - మరొక యిరుగుపొరుగు మనిషి - ఆ 'బికారీ' ఇంతే. ముందు చీకటిచాటున క్రీనీడలో కూర్చున్న 'బికారీ'ని నేనంత గమనించలేదు. ఆచార్య పరిచయం చేసిన తర్వాత కూడా నాకంత కుతూహలం కలగలేదు. కాని సిగరెట్టు వెలిగిస్తున్నప్పుడు అతని ముఖం చూస్తూ ఉంటే ఒక వెగటు, వింత నన్ను ఆవహించాయి. 'బికారీ' తల ఆడిస్తూ ఓర చూపుతో నాకేసి పరీక్షగా చూచాడు.

భవిష్యత్తులోకి తొంగిచూచి పుస్తకంలాగ చదవగలిగే అపూర్వవ్యక్తి తటస్థపడితే తన భవిష్యత్తు చదివించుకోవాలని ఎవరికి సరదా కలగదు? ఇలాంటి విషయాల్లో నాకు అసలు నమ్మకంలేదు. ఎంతోమంది కనిపిస్తూ ఉంటారు; చేతులు చూస్తారు; జాతక చక్రాలు వేస్తారు. వాళ్ళ మామూలు ధోరణిలో ప్రస్తుత పరిస్థితులు బాగాలేవని, త్వరలోనే మంచి రోజులు రాబోతూ ఉన్నాయనీ, దానికి కొన్ని గ్రహపూజలు చెయ్యవలసి ఉంటుందనీ అలాగచేస్తే పాపగ్రహపీడ పోతుందని యిలాంటి ధోరణిలో చెప్తారు. నమ్మించి డబ్బు గుంజుకుంటారు. పూటి కోసం కోటివిద్యలు!

కాని 'బికారీ' అటువంటివాడు కాడు. అతని ముఖం చూస్తేనే తెలుస్తుంది అటువంటి మోసం తెలిసినవాడు కాడని. అతనికి ధనాపేక్ష లేదు. మనం ఎంతయిస్తే అంత తీసుకుంటాడు. అసలు ఇవ్వకపోయినాగాని కించపడే మనిషి కాడు. ఆచార్యమాత్రం—అతని క్షేమంకోరి హస్తరేఖలు చూపించేవాళ్లందరివద్దా అయిదేసి రూపాయలు వసూలు చేస్తున్నాడు. 'బికారీ' ఒక విచిత్రమైన కొంటెచూపుతో వెకిలిగా నవ్వుతున్నాడు. నా చెయ్యి విప్పి 'బికారీ'కి అందించాను. ఆచార్య నన్ను వారించి యిప్పుడుకాదు, రేపు ఉదయం అతన్ని సంప్రతించు అన్నాడు. కారణం, 'బికారీ' పూటకు ఒక మనిషి భవిష్యత్తుకంటె ఎక్కువ చెప్పలేడట. కొద్ది కాలక్రితమే ఒక యింజనీరు చెయ్యిచూచి చెప్పాడట. ఒకరికి చెప్పే సమయంలో అతనికి విపరీతమైనభారం అనుభవించి బాధపడవలసి ఉంటుందట. ఒకసారి చెప్పివేసిన తర్వాత ఎంతో తేలిక పడినట్టు నిట్టూర్పు విడుస్తాడట. అప్పటికే భవిష్యత్ విచారణ ముగించి వాళ్ళు లోకాభిరామాయణంలో పడ్డారు. నేను కూడా ఆ కాలక్షేపంలో కలిశాను. పోనీ తొందర ఏముంది? మన్నాడు ఆదివారం ఉదయం ప్రశాంతంగా నాయింట్లోనే యీ పండితుణ్ని రప్పించి సంప్రతించవచ్చునని నిశ్చయించుకొన్నాను. ఉదయం కాఫీకి మాయింటికే రావలసిందని 'బికారీ'ని మా మిత్రుడు ఆచార్యనుకూడా ఆహ్వానించాను. వాళ్లు 'సరే' అన్నారు.

'బికారీ' ఇక్కడికి వచ్చి పదిరోజులు మాత్రం అయింది. రాగానే అతని భాగ్యరేఖ బయటపడి ఆచార్యతో పరిచయం కలిగింది. ఈ పదిరోజులలోనూ నూరు రూపాయలు అతను కళ్ళ చూశాడు. అతను చేతులు చూచిచెప్పిన ప్రతివాళ్ల విషయంలోనూ—చిత్రం అదేమిటో—అక్షరాలా నిజం అయ్యాయి. హెడ్‌గుమాస్తా గోపాలం చెయ్యి చూచి అతని పెద్ద కూతురికి పెళ్లి

సంబంధం వచ్చిపోతుందని చెప్పాడుట. సరిగ్గా అలాగే అయింది. మైత్రి కృష్ణ శర్మ చెయ్యి చూచి వారం రోజులలో సీటు మునిగిపోతుందని అన్నాడట. పాపం, అన్నంత పనీ అయింది; వారం రోజులు సెలవుమీద వెళ్ళాడు. సెలవుల్లో మలేరియా వచ్చాడు; మలేరియా తగ్గినవెంటనే వాడికి మునిగిపోయింది. స్కూలు మాస్టరు కేదారనాథ్ భవిష్యత్తు చూచి త్వరలో కుటుంబంలో ప్రాణి నష్టం అంటే అలాగ చెప్పిన పది రోజులు తిరగకుండా అతని తమ్ముడు అకస్మాత్తుగా రైలుప్రమాదంవల్ల మరణించినట్టు కబురు తెలిసింది. ఇలాగ ఇలాగ ఎన్నెన్నో విషయాల్లో బికారీ బాబు చెప్పిన మాటలు నిజమయ్యాయి. ఇది గాక అతనిలో ప్రత్యేక చాకచక్యం ఎవ్వరికీ తెలియని అంతర రహస్యాలు కూడా బయటపెట్టడలో. మెడికల్ కాలేజీలో ఆ క్రొత్త ప్రొఫెసరు "జలానీ" మొదటి భార్య ఉండగానే రెండో ఆవిడతో (హాస్పటలులో హౌస్ సర్జన్) ప్రేమకలాపాలు జరుపుతూ ఉన్నాడని ఎవరికి తెలుసు? సప్లై ఆఫీసరు 'సదానంద్' తో కాపురం చేస్తున్న ఆవిడ స్వంత భార్య కాదనీ 'ప్రియురాలు' అని 'బికారీ' ఆరా తీసేవరకు ఎవరు ఎరుగుదురు? ఒకటేమిటి ఎన్నైనా ఉదాహరణలు ఇయ్యవచ్చు బికారీ చెప్తున్న మాటలు అమోఘంగా నిజమవుతున్నాయని.

అందుకే ఇలాంటివాటిమీద ఏమీ నమ్మకం లేని నాకు కూడా విశ్వాసం కుదిరి అతనిని మా యింటికి పిలిపించాను.

భవిష్యత్తుగురించి ఎవరు సంప్రతించినా గాని అడగదలచుకొన్న విషయాలు రెంటే ప్రణయమూ, భాగ్యమున్నూ.

వర్తమాన పరిస్థితులు అనుకూలంగా లేకపోతే-భవిష్యత్తుమీద ఆశ పెట్టుకొని బ్రతుకు ఈడ్చుకొనిపోవడం మానవుని నైసర్గిక స్వభావం. ఎప్పటి కపుడే ఆ భవిష్యత్తు వర్తమానంలోకి మారిపోయే టప్పటికి నిన్నటికీ, నేటికీ రేపటికీ అట్టే భేదం కనిపించదు. తనకు లభించినదానితో తృప్తి పొందక-ఏదో అందనివాటికి అర్రులు చాపడం కూడా మానవుడి దౌర్బల్యాల్లో ఒకటేమో! తీరా ఆ యందనివి చేతి కందేటప్పటికి వాటిలో ఆనందం నశించి ఆశాభంగం పొందుతూ వుండటం ఒక పరిపాటి అయిపోతుంది. ఆశ కల్పించుకోవడం భంగపడటం అదే జీవితం. భంగపడిన తన పరాజయాలు మరచిపోవడానికి కొత్త ఆశలు సృష్టించుకొంటాడు మానవుడు. అందుకే భవిష్యత్తుతో సంప్రతిస్తాడు. మొత్తంమీద మత్తు కలిగించే మాయలోపడితే తప్ప మానవుడు బ్రతకలేడు. నాలో ఉన్న ఇటువంటి దౌర్బల్యమే నన్ను కూడా 'బికారి' భక్తుణ్ని చేసింది.

ఆదివారం ఉదయం- అనుకున్న సమయానికి బికారీ చరణ్ ఆచార్య సమేతంగా మా గృహం పావనంచేశాడు. కాఫీ, ఫలహారాలు పూర్తిచేసిన తర్వాత నేను చెయ్యి అందిచ్చాను. నేను అపుడే స్నానం చెయ్యడంవల్ల నా చేతులు శుభ్రంగానే ఉన్నాయి. బికారీబాబు తన వాడుక ప్రకారం సిగరెట్టు ముట్టించి, తన చొక్కా జేబులోంచి గుండ్రని భూతద్దం తీశాడు. మేము కూర్చున్న గదిలోకి తూర్పువైపు కిటికీలోంచి సూర్యకాంతి పడుతూ ఉంది. కిటికీదగ్గర కుర్చీ వేసి అక్కడ సోఫామీద కూర్చుండి అతన్ని చెయ్యి చూడమని అందించాను. చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. చేతిలో ఎన్ని రేఖలున్నప్పటికీ అతడు పరీక్షగా చూసింది నా భాగ్యరేఖ. దానిమీదనే అతడు చాలసేపు దృష్టి కేంద్రీకరించి పరికించాడు. అతని మెల్లకన్నుతో ఓరగా చూస్తూ తల వంకిస్తూ ఉంటే, కుదురుగా బంగారపు గూడు కట్టుకొంటూ ఉన్న నా భవిష్యత్తు కదలించి ఎక్కడ నేల కూలదోస్తాడో అని భయం వేసింది. అరగంటసేపు అలాగ 'పరీక్ష చేస్తూనే ఉన్నాడు. అంతసేపు నిశ్శబ్దం. తదేకదీక్ష. ఉలకడు పలకడు; ఆచార్య కూడా చూస్తున్నాడు గాని పలకరించడం లేదు. ఎప్పటికీ నోరు మెదల్చకపోతే నాకు విసుగెత్తింది. చెయ్యికూడా లాగుతోంది. చూస్తున్నంతసేపు 'బికారి' ముఖంలో నా కష్టసుఖాలు సుడిగుండాలు పడి తిరుగుతూ ఉన్నట్టు ఎన్నో కళవళికలు కనిపించాయి. ఒళ్ళంతా కంపించిపోయింది. అన్ని కండరాలా, అన్ని నరాలా ఆ ముఖంలోకి వెళ్ళి చుట్టుకొని పోయి ఎన్నో వికారాలు పొందుతూ ఉన్న ఆ ముఖం కనిపించింది. ఆ చప్పిదవడలు, బోసినోరు, మెల్లకన్ను, విరుసుగా పెరిగిన జుట్టు అతని వికృతముఖాన్ని మరింత వికృతం చేశాయి. ఎంతో బాధ, భారం, మథన ఆ ముఖంలో కనిపిస్తూ ఉన్నాయి. చివరికి మబ్బుల్లో వెన్నెలలాగ అతని కళ్లు చిరునవ్వుతో మెరిశాయి. ఈ మథన పడటం తర్వాత ఒక పెద్ద వెలుగు కనిపించినట్టు, అతని చిన్న కళ్లు కొంచెం పెద్దవి అయ్యాయి. భూతద్దంతీసి సంచిలో పెట్టి, జేబులోకి మార్చేశాడు, నా చెయ్యి తీసేసుకోమన్నాడు. ఆచార్యదగ్గర ఒక సిగరెట్టు తీసుకొని జీవితం అంతా ఒక గుక్కలో పీలుస్తూ ఉన్నట్టు పీల్చాడు.

అతని తలలో ఇంతసేపు పేరుకొన్న భావాలు ఒక్కసారి బయటికి వచ్చినట్టు సిగరెట్టు పొగ చక్రాలు చుట్టుకొని ఎగురుతూ ఉంది. అతను ఏదో గొణుగుతూ చెప్తున్నాడు. ఆ బోసినోరులోంచి వచ్చే మాటలు అంత చప్పున అందరికి బోధపడవు. పైగా అతని భాష వేరు నా భాష వేరు. ఆచార్య నాకు అర్థం విడమరచి చెబుతున్నాడు. నేను కొత్తగా బడికి వెళ్లిన పిల్లవాడిలాగ మౌనంగా కూర్చుండి వింటున్నాను. అడ్డుమాటలు లేవు ముందు అతను చెప్పేదంతా వినడమే!

హస్తరేఖలు చూచినంతమాత్రం చేత అట్టుపుట్టు ఆనవాళ్లు ఎలాగ తెలుస్తాయో? ఆశ్చర్యం నా జీవితంలో జరిగిపోయిన సంగతులన్నీ పూసగ్రుచ్చినట్టు చెప్పివేశాడు. నా పుట్టుక, నా విద్యాభ్యాసం నావృత్తి, వివాహం అన్నీ సరిపోయాయి. క్రిందటి సంవత్సరం మేము ఇల్లుకట్టడం, మాకు ఒక చంటిపాప పుట్టి గతించడం ఇవన్నీ చెప్పగలిగాడు.

గతం—అందరూ చెప్పగలరంటారు. భవిష్యత్తువిషయంలోనే నన్ను ముఖ్యంగా బాధిస్తూ ఉన్న పెద్దప్రశ్న నాకు బదలీ ఎప్పుడు అవుతుంది అని ఈ ఊరు వచ్చి రెండు సంవత్సరాలు పైగా అయింది ఇక్కడ పరిస్థితులు ఏవీ అనుకూలంగా లేవు ప్రతి క్షణమూ ముళ్లమీద నించున్నట్టే, మన శ్శాంతి లేదు; సౌకర్యం లేదు నరకయాతన అనుభవిస్తూ ఉన్నట్టు భావించడం. నాకే కాదు నాతో ఉన్న సహోద్యోగులకి కూడా ఈ ఊరులో ప్రవాసం ఎప్పుడు వదలిపోతుందిరా దేవుడా అన్న చింత బాధిస్తోంది. 'బికారీ'ని ఎవరు సంప్రతించినా వేస్తున్న ప్రశ్న ఇదే. "నాకు ఈ ఊరునించి ఎప్పుడు బదలీఅవుతుందని" నా విషయంలో 'బికారీ' ఈ ప్రశ్నకు సూటిగా జవాబు చెప్పలేదు. దానికి బదులు నా ఉద్యోగం మార్పు అవుతుంది అన్నాడు. హోదా, జీతం, అన్నీ సమానంగానే ఉండి చేస్తున్న పని మారుతుంది అన్నాడు. నాకు ఆశ్చర్యం వేసింది. అలాంటి మార్పువస్తే బదలీ కావాలే అని ముందు సంతోషపడ్డాను. కాని 'బికారీ' అటువంటి ఆశ కల్పించలేదు. ఉద్యోగం మార్పు జరిగినా ఊరు మార్పు లేదన్నాడు. మళ్ళీ నిస్పృహ కలిగింది. కాని ఇలాంటిది జరిగే సంభవం లేదే అన్నాను. నమ్మలేకపోయాను. అతడు పెట్టిన గడువుకూడా అల్పకాలమే. వారం, పదిరోజులు మాత్రమే. చూద్దాం అని లేచాం. ఆచార్య, బికారీ వెళ్ళిపోయారు.

అతడు చెప్పిన గడువు పూర్తిఅయిందీ; పదిరోజులూ పూర్తికాకుండానే నాకు తలవని తలంపుగా ఊహించడానికి వీలులేని మార్పు వచ్చింది. ఉద్యోగం మార్పు, హోదా, జీతం మరి దేనిలోనూ మార్పు లేదు బికారీ చరణ్ విచిత్రవ్యక్తి, అమోఘవాక్కు. ఒక్క నా విషయంలోనే కాదు ఎంతోమంది విషయంలో బికారీ చరణ్ వాక్కు నిజమయింది. అన్నింటికంటె పెద్దపరీక్ష 'ఆచార్య' విషయంలో. అతనికి బదలీ ఎప్పుడు అవుతుందని? మార్చి 15 వ తేదీలోపున బదలీ అయితీరుతుంది; కబురు తెలుస్తుంది. వెంటనే మాత్రం వెళ్ళవు మరి ఒకటిన్నర మాసాల తర్వాత మే నెలలో వెళ్తావు అన్నాడు. మార్చి 14 వ తేదీ శనివారం. 15 వ తేదీ ఆదివారం. ఏదైనా ఆర్డరు వచ్చిఉంటే శనివారం రావలసింది; రాలేదు. ఆచార్య ఆశాభంగం పొందాడు. బికారీమాటలు పొల్లుపోయినట్టు లెక్క వేసుకున్నాము. ఆదివారం ఉదయం అతడియింటికి పిలిచి యింతేనా నీ జోస్యం అని వెటకారం చేశాను బికారీ తన మెల్ల కన్ను పెద్దచేసి తల పంకిస్తూ 'అపుడే ఎక్కడయింది యీ వేళ సాయంకాలం వరకు చూడండి' అన్నాడు

ఆశ్చర్యం! ఆ వేళ సాయంకాలం 9 గంటలకు ట్రంకు టెలిఫోనులో ఆచార్యను బదలీ చేస్తూఉన్నట్టు ఖబురు తెలిసింది. ఆచార్య షికారువెళ్లి తిరిగి యింటికి వచ్చేటప్పటికి ఈ శుభవర్తమానం తెలిసింది. అతని సంగతి అతడే నమ్మలేకపోయాడు. మరొకసారి తన విభ్రాంతి ఎరుకపరుస్తూ 'బికారీ చరణ్ ప్రమాదంరమైన మనిషి' అన్నాడు.

ఈ వార్త ఊరంతా అగ్నిజ్వాలలాగ వ్యాపించింది. తెలుసున్న వాళ్ళంతా ముక్కుమీద వేలు వేసుకొన్నారు. బికారీ చరణ్‌తో సంప్రతించడానికి కొత్త సీటికి ఛేపలు ఎగబడినట్టు ఎగబడ్డారు. బికారీ వ్యాపారం బాగానే సాగుతూఉంది. ఒకొక్క వ్యక్తిలో ఒకొక్క విశిష్టత ఉంటుంది. అదిమాత్రం పరిరోషిగ రాణింపుకు రాదు. అవకాశం రానివ్వరు. ఈ విశాల భరతఖండంలో ఇలాంటి సిద్ధపురుషులు పూజాపునస్కారాలు లేకుండా హతిమారిపోతున్నారో! భవిష్యత్తు చెప్పగల ఇలాంటి వ్యక్తి ఎక్కడికి వెళ్ళినా రాణిస్తాడు ఇది ఇంద్రజాల మహేంద్రజాలం కాదు; మాయలమారి విద్య కాదు; అతనిలో సహజమైన ఇంగితశక్తి, నేర్పు, ప్రజ్ఞ. అది పూర్తి వినియోగంలోకి రావడానికి ఈ అభాగ్య దేశంలో అవకాశాలు లేవు. ఇతన్ని అమెరికా పంపిస్తేనో! డాలర్లు అభావంగా ఉన్న మనదేశానికి ఎంతయినా ఉపకరిస్తాడు. కోటీశ్వరులూ, గుత్తదారులూ ఉన్న అమెరికా దేశంలో ఇటువంటి వాడికి తప్పక గిరాకీ కలుగుతుంది. ఈ సంగతి ప్రధానమంత్రి పండిత నెహ్రూకి తెలియజేస్తే భారతదేశ ప్రతినిధిగానూ, ప్రముఖ డాలరు సంపాదకునిగానూ బికారీరాయిని పంపిస్తాడేమో అనిపించింది. ఏది ఏమైనా ఆచార్య బదలీఅయినప్పటినించీ బికారీచరణ్ అంటే నా శ్రద్ధాభక్తులు మరింత అతిశయించాయి. మళ్ళీ అతన్ని సంప్రతించాను. ఆచార్యా, నేనూ కలిసి సంప్రతించాము. ఈమాటు నన్ను బాధిస్తున్న ప్రశ్న బదలీ సంగతి. ఒక తారీఖు చెప్పి ఆలోపున అయితీరు

కుంది అన్నాడు. ఆచార్య అడిగింది అతని ప్రమోషన్ సంగతి, వివాహం సంగతిన్నీ. రెండూ కూడా ఫలానా తారీఖుల్లో జరుగుతాయని 'బికారీ' లిఖితపూర్వకంగా వ్రాసి యిచ్చాడు. కాని ఆ తారీఖులు ఇంకా చాల దూరంలో ఉండటంచేత మేమంతగా పాటించలేదు. అతడు వ్రాత మూలకంగా యిచ్చిన జ్యోస్య విశేషాలు మాత్రం మా స్వంత పెట్టెల్లో భద్రపరుచుకున్నాం.

ఏది యెలాగయినా బికారి విషయంలో నా కుతూహలం పోలేదు. ఇంత ఇటువంటి విశేషప్రజ్ఞ యీ వికృత పురుషుడికి ఎలాగ అలవడిందా అని జిజ్ఞాస బాధిస్తూనే ఉంది. ఒక రోజు ఆచార్య, నేనూ కూర్చుండి 'బికారీ'తో యీ మాట కదలవేశాం. అతను ఆ వేళ ఉత్సాహంగా ఉన్నాడు. మాకందరికీ కుతూహలం కలిగిస్తూ ఉన్న తన ప్రజ్ఞావిశేషం మొట్టమొదట తనకు ఎలాగ అలవడిందీ వివరిస్తూ చెప్పాడు. అదంతా ఒక పెద్ద కథ. నేను చెప్పే కంటె అతని మాటల్లోనే అనువదిస్తాను.

నేను మొదటినించీ యిలాగ 'బికారీ' గా లేను చిన్నతనంలో నేను కూడా అందరితోపాటు అష్టయిశ్వర్యాలు అనుభవించాను. తలిదండ్రులతో ఆప్యాయంగా పెరిగాను. మాది చాల ఉన్నత కుటుంబం. (అవును—అతని పెత్తండ్రి బిడ్డలు పెద్ద ఉద్యోగాలలో ఉన్నారు; పినతండ్రి పెద్దవ్యాపారి. మేనమామ బిడ్డలు రాజకీయ నాయకులు. ఒకడు అసెంబ్లీమెంబరు; ఒకడు జిల్లాబోర్డు అధ్యక్షుడు) ఇపుడా బంధుత్వం పురస్కరించుకొని వాళ్ళను నేనేమీ అడగను; ఆశ్రయించను. నా వాళ్ళని నేను గొప్పగా చెప్పుకోను కూడాను. ఆమాట అలాగ ఉంచండి మొదట్లో—అందరిలాగే నేనూ కాలేజీలో చదువుకొంటూ ఉంటే నాకు ఒక అమ్మాయితో పరిచయం కలిగింది. ఆ పరిచయం అంతకంతకుముదిరి ప్రణయంఅయింది. వాళ్లు కిరస్తానీమతం తీసుకున్నారు. ఆ పిల్లను నేను పెళ్లిచేసుకోవడానికి మా నాన్నగారికి ఎంతమాత్రం యిష్టంలేదు. అయినా సరే తెగించి నేను మతం మార్చుకొని పెళ్లి చేసుకుందామనుకున్నాను. పరీక్షలు అయిపోయిన తర్వాత సెలవుల్లో ఈ పని చేద్దామనుకున్నాను. నా ప్రణయ గాథ విన్నప్పటినించీ మా నాన్న నాకు చదువు కోసం పంపే సొమ్ము పంపడం మాని వేశాడు. నేను హోటలులోనూ, స్నేహితులదగ్గరా ఎన్నో అప్పులు చెయ్యవలసి వచ్చింది. పరీక్షలు పూర్తిఅయ్యేటప్పటికి బాకీదారుగా తేలాను. నాకు మనశ్శాంతి లేకపోయింది. నా ఆర్థికదురవస్థ చూచి, నేను ప్రేమించిన అమ్మాయి కూడా నన్ను త్రోసిపుచ్చింది. నేను వేరే సాయంకాలం వేళల్లో లెక్కల గుమాస్తాగా చేరి, సెలవుల్లో ట్యూషన్లు చెప్పి బాకీలనించి తేరుకున్నాను. పరీక్షాఫలితాలు తెలిసేటప్పటికి నా పరీక్షపోయింది. చేతిలో రాగిదమ్మిడీ లేదు. నాన్న, వాళ్లు నన్ను కులభ్రష్టుని చూచినట్టు చూడటం మొదలుపెట్టారు. నా యింట్లో నేనే వెలిఅయ్యాను. డబ్బులేని నేను ప్రేమించిన అమ్మాయి దగ్గరికి వెళ్ళి ప్రేమభిక్ష వేడితే నన్ను నిరాకరించింది. వాళ్ళవాళ్ళు కూడా యీ ప్రణయమంత్రం లోంచి తప్పించుకోవడానికి ఆపిల్లకి వాళ్ళ సంఘంలోనే ఒక పెద్దవయస్సువాడిని చూచి పెళ్ళిచేశారు.

నాకు నాలుగువైపులా నిరాశ, నిస్పృహ. నామీద నాకు ధైర్యం నశించింది. ఎందుకు వచ్చిన పాడుజన్మ? ఎవరికి ప్రయోజనం? ఇలా గతించిపోతేనే మంచిదని నాయంతట నేనే అంతమొందించుకుందాం అనుకున్నాను. లాభం లేకపోయింది. ఆ వేళతో నేను పనిచేస్తున్నచోట నాకు ఉద్వాసన చెప్పారు. ఎక్కడికి వెళ్ళడానికీ నా యన్నవారు లేరు. నా బంధువులు మొదలే వెలివేశారు. జన్మస్థలానికి వెళ్తే కన్నెత్తి చూచేవాళ్ళు ఉండరు.

పోనీ, ఎక్కడయినా పనికి ప్రయత్నిస్తే— ఎక్కడికివెళ్తే అక్కడ లేదు లేదు అని కసిరి పొమ్మంటున్నారు. చివరికి జీవితమే విసుగు అయిపోయింది. కొన్నిరోజులు తిండిలేకుండానే ధర్మశాలల్లోనూ, రైల్వే స్టేషన్లలోనూ కాలక్షేపం చేసివేశాను. ఇంక ఆనాడు తెగించివేశాను. రైలుబండి స్టేషన్‌నించి బయలుదేరింది. ఒక మిత్రుడు తటస్థపడి స్టేషన్ రెస్టారెంటులో ఏవో అవీ యివీ నాకు తినడానికి ఇప్పించాడు. ఆకలి కడుపుకు అవే పంచభక్ష్య పరమాన్నాలులాగ కనిపించాయి. నేను అవి తిన్న తరవాత స్నేహితుణ్ని బండికి సాగనంపాను. బండి వెళ్లిపోయింది. తిరిగి నేను మిగిలిపోయాను. నాతోపాటు స్టేషనూ, అక్కడ స్టాల్సూ అన్నీ మిగిలిపోయి నాకేసి వెక్కిరింపుగా చూస్తున్నాయి. ఇంక బ్రతుకు దుర్భరం అనిపించింది. మరోక వైపునించి రైలుబండి వచ్చింది. అది స్టేషన్‌లో ఉన్నంతసేపు — ఆ పదిహేను నిమిషాలూ ఎలాగ గడిచాయో — క్షణం ఒక యుగంలాగ అనిపించింది. చివరికి బండి కదలడానికి సిగ్నల్ ఇచ్చారు. కదిలింది. కదుల్తూఉండగా చివర పెట్టెలో ఊచలు పట్టుకొని నిలబడ్డాను. దానితో నా జీవితాంతం అయిందనుకున్నాను. భయంకరమైన ఆఘాతంలో క్రిందపడిపోయాను. మళ్లీ నాకు తెలివి వచ్చేటప్పటికి నేను ఆసుపత్రిలో ఉన్నాను. నేను మాటలాడటం ప్రారంభించగానే డాక్టరు నా ఊరు, పేరు తలిదండ్రులు ఇవన్నీ విచారించి అడిగాడు. నేను ఒకటీ సరిగ్గా చెప్పలేదు. దిక్కులేని అనాథగా నన్ను వాళ్లు భావించారు. కొన్నాళ్ళకి తెలిసింది నాకు మూడు పెద్ద ఆపరేషన్లు చేశారనీ, కిందన్న అంతా కుట్లుకుట్టి మార్చడంలో నా కన్ను పెల్లపోయిందనీ నా ఆకారమే మారిపోయి వికృతంగా తయారు అయ్యానని బోధపడింది. నా ముఖం పోల్చుకోవడానికి వీలులేకుండాపోయింది. జ్ఞాపకశక్తి ధారణశక్తి చాల క్షీణించిపోయింది. నా చదువు, విజ్ఞానం ఏమైపోయాయో — ఈ పతనం తరవాత నా జీవితం మరింత నిరర్థకంగా కనిపించింది. దేనికోసం బ్రతుకు? ఎవరికోసం? తిరిగి జీవనసంగ్రామం ప్రారంభించాలి; అడుగడుగునా పరాభవాలూ, పరాజయాలూ, బ్రహ్మరాక్షసుల్లాగ నా వైపు గేలిచేస్తూ ఎదురవుతున్నాయి. పరిస్థితులు మానవుణ్ని లొంగదీస్తాయి. మానవుడు పరిస్థితుల్ని లొంగదీసుకోలేడు.

అందుకే ఎవరో వేదాంతి తత్వంలో చెప్పాడు— కాలమను ప్రవాహమున గడ్డిపోచగ నీదు మనుగడ—ఎలాగ ఈడిస్తే అలాగ త్రోసుకొని పోవలసిందే—మునిగినా తేలినా కాలవాహినిదయాధర్మాలమీద ఆధారపడి ఉంటుంది. జీవితంమీద విరక్తిపొంది ఇది అంతం పొందించుకుందామన్నా సాధ్యం కాలేదు. ఆకారవికారాలే మారిపోయాయి పూర్వ వాసనలూ ప్రేమ వాత్సల్యాలూ చలించిపోయాయి, నా ప్రేమ మన్నించేవాళ్లు గాని- ప్రతిఫలం— చూపించేవాళ్లుగాని కనిపించలేరు. నా కుటుంబం వాళ్లే నన్ను కాదన్నారు; చిన్నబుచ్చారు. ఇంక నాకు ప్రేమ అనుకంప చూపేవాళ్లు ఎవళ్లు? లోకంలో తిండిలేక బ్రతకవచ్చు; గాలి, నీరు లేకపోయినా ప్రాణాలు భరించవచ్చు; నిన్ను ప్రేమించే వాళ్లు ఒకళ్లుకూడా లేకపోతే బ్రతకడం దుర్భరం. నామీద నాకే ప్రేమ నశిస్తూ ఉన్నట్టు అనిపించింది. అయినా— ఈ అనంతకోటి ప్రాణిజాలం ఎందుకు ఎలాగ దైనందిన జీవితం సాగించుకొంటూ బ్రతుకుతూ ఉన్నదో అలాగే నేనూ బ్రతకక తప్పదనిపించింది. మళ్లా జీవనభృతికి కావలసిన మార్గాలు వెదకడం ప్రారంభం



కుమారి దేవతలక్ష్మి శ్రీ దేవత రామమోహనరావు బి.ఏ. గారి కుమార్తె. గవర్నమెంటు గరల్సు హైస్కూలు వార్షికోత్సవ సందర్భములో నటనా కౌశల్యమునకు రెండు పతకములు పొందిన విద్యార్థిని!

చేశాను. ముందటిలాగే తిరిగి ఎక్కడికి వెళ్తే అక్కడ చుక్కెదురు. మెదడుతో చేసే పని కాకుండా, కేవలం కండరాలతో చేసే పనిలో అయినా ప్రవేశించాలని అనిపించింది.

రోజు కూలికోసం ప్రయత్నం చేశాను. రెండురోజులు రోడ్డుపోసే పనిలో పని చేశాను. ఎప్పుడూ అలాంటి బండపనులు చెయ్యక ఒళ్లు హూనం అయిపోయింది. వాళ్లు ఇచ్చిన మూడు రూపాయలు మూడు రోజులలో అంతరించిపోయింది. మరి మూడు రోజులవరకు పనిలోకి వెళ్ళలేక పోయాను. అలిసి సొమ్మసిల్లి-మూడురోజులు ఒకటే నిద్ర అయిపోయింది. ఇంక యీరకం జీవితం నచ్చక మరోక గ్రామం వెళ్లిపోయాను. (ఇంకా వుంది)

## సీరియల్ నవల

# రెండు మహానగరాలు

### చార్లెస్ డికెన్స్

### 5

లారీ, ఆ ఖాతాదారు కథను ఇలా ఉపక్రమించాడు:

'ఆయన ఫ్రెంచి పెద్దమనిషి; పారిస్‌లో మంచి పేరుప్రతిష్ఠలు సంపాదించుకున్న పెద్ద డాక్టరు—'

'బోవే వంశమేనా అండీ?'—

'అవును బోవే వంశమే; మీ నాన్నగారు, మాన్సియర్ మానెట్ లాగా, ఆయనదీ బోవే వంశమే. మీ నాన్నగారి లాగానే ఆయనకూడా మంచి గౌరవమర్యాదలుగల మనిషి—ఆయన నాకు బాగా పరిచయస్థుడే—అంటే కేవలం వ్యాపార లావాదేవీల పరిచయమే ననుకో. అయితే ఆయనతాలూకు స్వంత వ్యవహారాలతో సంబంధం వుండటంచేత, మా ఇద్దరికీ చాలా అంతర్యం వుండేది. అప్పట్లో నేను, మా ఫ్రాన్సు హెడ్ ఆఫీసులో పనిచేస్తున్నాను'—

'అప్పట్లో అంటే?'—

'ఇది ఇరవై సంవత్సరాలనాటి సంగతి. ఆయన, ఒక ఆంగ్ల స్త్రీని వివాహం చేసుకున్నాడు. ఫ్రెంచివాళ్లల్లో, కాస్తో కూస్తో వున్న ప్రతి వొక్కరూ, తమ ఆస్తిపాస్తులను బ్యాంకి అజమాయిషీ క్రింద అట్టిపెట్టుకుంటారు. అలాగే ఆయన వ్యవహారాలన్నిటినీ కూడా మా బ్యాంకే చూస్తూ వుండేది. బ్యాంకు ఉద్యోగిగా ఇతర ఖాతాదార్ల వ్యవహారాలతోపాటు ఆయన వ్యవహారాలను కూడా నేనే చూస్తూవుండేవాణ్ణి. ఇవన్నీ కేవలం వ్యాపారసంబంధాలు; వాటిలో స్నేహవాత్సల్యాలుగాని, యితర ఆత్మీయతలుగాని యేమీ లేవు. దైనందినవ్యాపారనిర్వహణలో ఒక ఖాతాదారు పనిపూర్తి అయినతరవాత అది విడిచి రెండో ఖాతాదారు పనిలోకి యెలా మారుతానో అదేపద్ధతిలో నా ఉద్యోగ జీవితం అక్కడినుంచి యీ దేశానికి మారింది. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే, దీన్లో వ్యక్తిగతంగా నా వాత్సల్యానురాగాల ప్రసక్తి యేమీ లేదు. నేను కేవలం ఒక యంత్రాన్ని—సరే ఇక అనంతర గాథ'—

'ఇది నా తండ్రి చరిత్ర—నా కేదో తోస్తోందంటే'—అతని ముఖంలోకి పాలోచనగా చూస్తోంది: 'నా తండ్రి చనిపోయిన అనంతరం రెండేళ్లలోనే నా తల్లి కూడా చనిపోయింది. తల్లి తండ్రీలేక దిక్కులేని బిడ్డగావున్న నన్ను, ఇంగ్లండుకు తీసుకువచ్చింది మీరే ననుకుంటాను—తప్పకుండా మీరే అయివుంటారని నా నమ్మకం.'

'ఆసరాకోసం, అనురాగంకోసం కంపరలాడుతూ తీగలా సాగి అతని యుంకేలిని అందుకోవటానికి ప్రయత్నిస్తున్న ఆ అభాగ్యురాలి చేతిని ఆప్యాయంగా అందుకుని హృదయానికి హత్తుకున్నాడు. కళవళంగా లేచి దగ్గిరికివచ్చిన ఆ స్త్రీని మళ్ళా నెమ్మదిగా కుర్చీదగ్గిరికి నడిపించుకుపోయి కూర్చోపెట్టాడు. ఎడంచేత్తో కుర్చీ పట్టుకుని, ఆ స్త్రీముఖంలోకి చూస్తూ, దగ్గిరగా నిలబడ్డాడు. ఆవిడకూడా తల పైకెత్తి అతనికేసి చూస్తోంది.

'అవునమ్మా! నిన్ను తీసుకువచ్చింది నేనే!—అయినా తిరిగి నిన్ను చూడ్డానికి నేను ఎప్పుడూ రాలేదు—నాకు హృదయం లేదంటానికి యీ ఒక్క విషయం ఆలోచిస్తే నీకు తెలుస్తుంది. ఇతర ప్రాణులతో నాకుండే సంబంధ బాంధవ్యాలన్నీ వ్యాపార లావాదేవీలు వినహా మరోటి కాదు. అందాకా యెందుకు—ఇన్నిరోజులనుంచీ నువ్వు బ్యాంకు సంరక్షణలోనే వున్నావు. అయినా నేను యితర ఖాతాదార్ల వ్యవహారాలతో సదమదమవుతున్నానేగాని నీ సంగతి రవ్వంతైనా ఆలోచించానా? నాకు వాత్సల్యానురాగాలనేవి లేవు. అలాంటివాటికి నాలో అవకాశం లేదు. అసలు అలాంటి ఆలోచనలకు నాకు టైమేదీ! నిరంతరం, బ్రహ్మాండమైన ఒక ఆర్థిక యంత్రాన్ని తిప్పటంతో నా జీవితం గడిచిపోతోంది.

తన దైనందిన కార్యకలాపాలకు సంబంధించిన ఈ విచిత్రాభివర్ణన ముగించి, నెత్తిమీది విగ్గు సరిచేసుకున్నాడు. మళ్లా అదే బాణీలో నిల్చుని అసలు కథ తిరిగి మొదలుపెట్టాడు.

'నీవన్నట్టు, ఇంతవరకూ ఇది నీ తండ్రి చరిత్ర. కానిముందు కథ కొంత వ్యత్యాసంగా వుంటుంది. ఒకవేళ మీ తండ్రి, తాను చచ్చిపోయినప్పుడు చచ్చిపోలేదనుకో—కలవరపడకు!! అరే! ఎందుకంత కంగారూ?

ఆ స్త్రీ నిజంగా, చాలా కలవరపడ్డది. ఆ కంగారులో అతని మునికట్టు గట్టిగా పట్టుకుంది.

తన ఎడమ చేత్తో ఆ యువతి మునివేళ్ళను నిమురుతూ అనునయంగా మాట్లాడుతున్నాడు. 'మనసు కాస్త స్థిమితపరచుకో—ఆందోళన దేనికి? ఇదంతా కేవలం వ్యాపారవ్యవహారం. ముందటే చెప్పానుగాదూ—'

ఆవిడకంగారు చూసి క్షణం తటాయించి, ఇటూ అటూ రెండుసార్లు పచారుచేసి మళ్లా మొదలెట్టాడు.

'నేను చెప్పినట్టు మాన్సియర్ మానెట్ చచ్చిపోలేదనుకో; హఠాత్తుగా ఎవరికీ తెలియకుండా అదృశ్యమైపోయాడనుకో; ఆయన్ను యెవరో యెక్కడికో యెత్తుకుపోయారనుకో; ఇదమిద్ధ

అనువాదం: తెన్నేటి సూరి

మని తెలియకపోయినా, ఏదో భయంకరమైన ఒక అజ్ఞాతానికి తీసుకుపోయారనుకో; ఫ్రాన్సులో మంచి పలుకుబడిగల దేశభక్తుడనిపించుకుంటున్న ఒకడు తన పలుకుబడి వినియోగించి, ఏ మనిషిని బడితే ఆ మనిషిని తన స్వంత కారాగారంలో ఎంత కాలం బడితే అంతకాలం బంధించి వుంచటానికి, ప్రభుత్వందగ్గిర నుంచి 'బ్లాంక్ వారంట్లు' మీద ముద్రలు వేయించి తెప్పించి ఆయన్ని యెక్కడికో ఎత్తుకుపోయి ఖైదుచేశాడనుకో; భర్త యేమైందీ తెలియక మానెట్ గారి భార్య కోర్టుల చుట్టూ, మత గురువులచుట్టూ, రాజారాణీల చుట్టూ కాళ్లు అరిగిపోయేలా తిరిగి ఏమీ లాభంలేక నిరాశ చేసుకున్నదనుకో—అలా జరిగివుంటే, నీ తండ్రి చరిత్రా, దురదృష్టవంతుడైన ఈ బోవే డాక్టర్ చరిత్రా ఒకటై వుండాలి.'

'మీ చేతులు బుచ్చుకు బ్రతిమాలుతున్నాను—ఇంకా కొంచెం వివరంగా చెప్పండి.'

'చెబుతాను—చెప్పబోతున్నాను—ఇందులో భరించరానిదేమీ లేదు కూడా.'

'ఏదైనా భరించగలను—ఫరవాలేదు చెప్పండి.'

'మా తల్లిగాదూ—మంచి ధైర్యమైనమాట చెప్పావు—ధైర్యస్థురాలివి. దీన్లో ఏముంది—కేవలం వ్యాపారవిషయం—వ్యాపారవిషయంగానే ఆలోచించు—వ్యాపార వ్యవహారంగానే నిర్వహించాలి; ఇక, ఆ డాక్టరుభార్య, ఎంతో ధైర్యసాహసాలుంగల ఇల్లాలే అయినా, ఆ బిడ్డ గర్భంలో వున్నంత కాలం, భర్తకోసం ఎంతో పరితపించి వేదనపడ్డదనుకో'—

'ఆబిడ్డ ఆడపిల్లేనా సర్?'—

'ఆడపిల్లే!—అంతా వ్యాపార వ్యవహారం—అనవసరంగా దిగులుపడకు. ఆ యిల్లాలు, తన మనోవేదనంతా బిడ్డకు సంక్రమింప చెయ్యగూడదనే ఉద్దేశంతో, సాంతం చనిపోయాడనే అభిప్రాయాన్ని కలుగజేసి బిడ్డను సాకురావటానికి ప్రయత్నించిందనుకో. ఉండుండు! అలా నా కాళ్లమీద పడకు! నిజానికి దీన్లో నీవు నా కాళ్ళమీదపడవలసిన అవసర మేముంది!'

'ఓ పరమకారుణికుడా!—నీ ఋణం నే నెలా తీర్చుకోగలను?'—

'ఇది వ్యాపార వ్యవహారం—నువ్వు నన్ను అయోమయం చేస్తున్నావ్!—నాకు మతిపోతే ఈ వ్యవహారాన్ని నిర్వహించేదెలా?—మనకు నిర్మలమైన మనస్సులుంటేగాని పనిసాగదు. ఆగు—నీ మనస్సు సరీగా వుందో లేదో పరీక్ష చెయ్యాలి—తొమ్మిదితొమ్మిదు లెంత? 20 గినీలకు ఎన్ని షిల్లింగులు?'

ఆవిడ యీ ప్రశ్నలకు సమాధానం చెప్పలేదు. అతని మనికట్లను పట్టుకున్న చేతుల వణుకు మాత్రం కొంచెం తగ్గింది. దాంతో జర్విస్‌లారీకి కాస్త ధైర్యంచిక్కి:'

'మంచి తల్లివి—ధైర్యస్థురాలివి—బాగుంది'—అంతా వ్యవహారం, దీన్లో ఏముంది?— లాభదాయకమైన వ్యాపారం. అవిధంగా యేర్పాటు చేసింది మీ అమ్మ. అనేకరోజులు, భర్తకోసం వెతికివెతికి నిరాశచేసుకుని ఆ మనోవ్యాధితోనే చనిపోయింది. నీవు అప్పటికి రెండేళ్ల పసిగుడ్డువు; ఏవిధమైన చింతా లేకుండా నువ్వు సుఖంగా పెరిగి పెద్దదానివి కావాలనుకుంది. నీ తండ్రి యే అజ్ఞాతంలోనో జీవచ్ఛవంగా మరణయాతనను అనుభవించుతూ వుండవచ్చుననే ఊహాలను నీకు అందజేసి—నీ ముఖం ఆ దుఃఖరేఖలతో కావురు వేసిపోయేట్టు చేయటం ఆవిడకి యిష్టంలేకపోయింది.

ఈ మాటలు చెబుతూ జాలిగా ఆ స్త్రీ బంగారు జుట్టువంక మెచ్చుకోలుగా చూస్తున్నాడు. అలా జరిగివుండకపోయినట్లయితే, ఈ పాటికీ ఈ అందాలజుట్టులో తెల్లవెంట్రుకలు పొటమరించేవే అనుకున్నాడు.

'మీ తలిదండ్రులకు పెద్దఆస్తీ యేమీ లేదు; కాస్తో కూస్తో, వున్నది యేవీటో మీ అమ్మకూ నీకూ సంక్రమించేవుంది' ఇప్పుడు—డబ్బుకు సంబంధించిగాని, ఆస్తిపాస్తులకు సంబంధించిగాని కొత్తగా బయటికొచ్చిన విషయాలేమీ లేవు—కాని'—

అతని మనికట్టుమీద, ఆ స్త్రీ వేళ్లు బిగుసుకున్నయ్—అతను ఆగిపోయాడు. ఆ స్త్రీ నుదురుమీద భయాందోళనలు చీకట్లుగా క్రమ్ముకున్నయ్.

'కాని ఆయన—ఆయన ఆజాకీ తెలిసింది. సజీవుడై వున్నాడు. చాలా మారిపోయాడు—శిథిలుడు; త్వరలో మంచి స్థితికి రాగలడనే ఆశించుదాం, ప్రాణాలతో వున్నాడుగదా! నీ తండ్రి యిప్పుడు, పారిస్‌లో ఆయన తాలూకు ఒక పాతనౌకరు యింట్లో వున్నాడు. అక్కడికి చేర్చారు; మనం యిప్పుడు అక్కడికి పోతున్నాం; ఆయన్ను నేను గుర్తించి ఆ మనిషేనని రూఢిచేయవలసి వుంది; నీవు నీ ప్రేమానురాగాలు చూపించి తగిన సేవచేసి, ఆయన్ను సజీవుణ్ణిగాజేసి పునర్జన్మనీయవలసి వుంది

ఆ స్త్రీ సర్వావయవాల్లోనూ ఒక చలిగుబులు వ్యాపించిపోయింది. భయావేశాలు ముప్పిరిగొన్న రుద్ధకంఠంతో, కళవళంగా:

'ఆయన భూతాన్ని చూడబోతున్నాను—ఆయన కంకాళరూపాన్ని చూడబోతున్నాను?—ఆయన్ని కాదు!'—

'ఎందుకు తల్లీ విచారిస్తావ్?—మంచీ చెడూ అంతా చెప్పేశాను. అనేక అన్యాయాలకు గురియై నరకయాతన లనుభవించికూడా యింకా సజీవుడైవున్న నీ తండ్రిని నీవు ఆదరించబోతున్నావ్. మార్గమధ్యంలో వున్నాం. సముద్రం యీ పక్కనుంచి ఆ పక్కకు చేరామంటే చాలు; వెంటనే ఆయన్ను చూడగలుగుతావు.'

'ఆయనవిషయమేమీ తెలియని అజ్ఞానంలో ఇంతకాలం ఇలా సుఖంగా బ్రతుకుతున్నాను.'

'ఇంకొక్క సంగతి చెప్పవలసివుంది. ఆయన, ప్రస్తుతం, మరో మారుపేరుతో వున్నారు. ఆయన అసలుపేరు యేనాడో మరుగునపడిపోయింది. దాన్ని గురించి భోగట్టా చెయ్యటం, ఎవరెవరి కుట్రలవల్ల యేయే ఖైదుల్లో బాధలు పడ్డాడో విచారించటం, ఇదంతా ఇప్పుడు అనవసరం అన్నమాట అలా వుండగా, చాలా ప్రమాదకరం. ఈ విషయం, యే సందర్భంలోనూ, ఎక్కడా బయటికి పొక్కనీయగూడదు. ఇప్పుడు జరుగవలసింది వల్లా—ఏవిధమైన అలజడీ లేకుండా, ఆయన్ను యేదో విధంగా, ఫ్రాన్సునుంచి మెమ్మదిగా యివతలికి తీసుకువచ్చెయ్యడం. ఇంగ్లీషువాణ్ణి, టెల్‌సన్సు బ్యాంకుఉద్యోగిని కావటంచేత వ్యక్తిగతంగా నాకేమీ ప్రమాదం తటస్థించే అవకాశంలేకపోయినా, ఈమాట యెక్కడైనా ఎత్తామంటే, నా పీకమీదికి కూడా వస్తుంది. ఈ వ్యవహారానికి సంబంధించిన ఇంత చిత్తుకాయితం ముక్క కూడా నేను వెంట తీసుకురావటం లేదు. నా అభిజ్ఞాపత్రాలూ, అధికారపత్రాలూ అన్నీ "పునర్జన్మ" అనే ఒక్క సాంకేతిక

(19-వ పేజీ చూడండి)



# అపమానం



**మిస్ రాజేశ్వరీరాణి**

దటినుంచీ రామంనాన్న నరసింహానికీ, మూడో ఇంటి ప్లీడర్ కాంతమూర్తికీ ఉప్పుకు నిప్పుకు వున్నంత బంధుత్వమే. కాంత బాబు ప్లీడరు. ఇటు నరసింహం మేజస్ట్రేట్! ఏమాత్రం తీసిపోరు ఎందులో అయినా. ఒకనాడేమో నరసింహంగారి చిన్న కూతురు లలిత జానకితో బడికి వెళ్లుతానని ఏడ్చి రెండిళ్లుదాటి ఆ తర్వాత రానని ముకుటం వేసింది జానకికి కోపంవచ్చింది. బడికి లేటయితే దెబ్బలు తగుల్తాయ్. లలిత వస్తానని కాసేపు మారాంచేసి, కాసేపు అలంకరించుకుని జానకిని నిలేసి కూడావచ్చి తీరా పది అడుగులేనా వెయ్యకుండా 'అమ్మ' అంటూ రాగం తీసేసరికి జానకి వుడికిపోయి "తిరిగిపో ఇంటికి" అని ఒకే దౌడు తీసింది. లలిత గట్టిగా ఏడుస్తో కాంత బాబు వాకిట నిలపడ్డది. అప్పుడే అన్నీ తీర్చుకొని వెలుపలికి వస్తున్న కాంతబాబు ముద్దొచ్చే లలితను అలానే ఎత్తుకొని ఆఫీసు రూంలోకి తెచ్చాడు "ఎవరమ్మా! ఏం కావాలి?" అంటూ.

ఆ ప్రశ్నలు నాన్న తప్ప ఇంట్లో ఎవ్వరూ వేయరు. అందుకని లలిత "బిస్కట్" అంది ముద్దుగా ఏడ్పు, బడి, జానకిని మర్చిపోయి.

కాంతబాబు బిస్కట్ ఇచ్చాడు. లలిత అవి అందుకొని తింటం ప్రారంభించింది.

"ఎవరమ్మాయివి నువ్వు?" అన్నాడు ప్లీడరు.

"నాన్నగారమ్మాయిని"

"మీ నాన్నెక్కడ?" అర్థంకాక అడిగాడు కాంతబాబు.

"ఇంట్లో వున్నారు"

"మీది ఏ ఇల్లు?" లలిత మాటలు ప్లీడరుకి కొంచంకూడా అవగాహన కాలేదు.

"మా ఇల్లే మా ఇల్లు"

"మీ నాన్న పేరేమిటి?" తప్పించుకొని వచ్చిందా బిడ్డ అని సందేహం వచ్చింది ప్లీడరుకి.

"మా అమ్మకు తెలుసు"

"నీకు తెలీదా? అయితే నీ పేరూ?" ఆశ్చర్యం సందిగ్ధంలో పడ్డాడు ప్లీడరు. ఎవరమ్మాయి ఈ అందమైన పిల్ల? దారి తప్పి ఏడుస్తో తన వాకిట నిలపడ్డదా?

"నా పేరు లలిత. ఇంకో బిస్కట్ లేదూ?"

"వుంది. చాలా వుంది. మీ ఇల్లెక్కడో చూపుతావా? నిన్ను తీసుకెళ్ళి విడిచి వస్తాను."

"వూహుఁ...మా ఇల్లు నాకు తెలుసు... నీకు తెలియదూ?"

"వూహుఁ...ఇంద బిస్కట్. పద పోదాం."

లలిత బిక్కమొగం వేసింది "నేను బిస్కట్టులు తిన్నది మా అమ్మతో చెపుతావా?"

ప్లీడరుకి నవ్వు వచ్చింది "మీ అమ్మ ఎవరో నాకేం తెలుసు...చెప్పను...పద"

"వూహుఁ...మా అమ్మ కొడుతుంది. అమ్మతో చెప్పనంటే వస్తాను"

"మీ అమ్మ ఎవరో నాకేం తెలుసు?"

"మరి మా నాన్నకు మాఅమ్మని తెలుసే?"

ప్లీడరుకి వచ్చి వెలక్కాయ ఇరుక్కుంది గొంతులో... "సరే...పద... చెప్పను"

"చెపుతావు. తర్వాత ఎందుకు తిన్నావని కొడుతుంది"

"చెప్పను లలితా...మీ అమ్మతో నేను మాట్లాడను"

"ఎందుకు మాట్లాడవు! మా అమ్మతో జగడం వేశావా?"

ప్లీడరు తల దిమ్మెక్కింది. ఎవరీ అఘాయిత్యపు పిల్ల...ఎవరింటి అమ్మాయ్?

"మాడు లలితా.. మీవాళ్ళు నిన్ను వెతుక్కుంటూ వుంటారమ్మా. లే... దారిలో నీకు కావలసినన్ని పండ్లు, బిస్కట్లు, బొమ్మలు అన్నీ కొనిపెడుతా మీ అమ్మతో చెప్పనులే...పద...మీ ఇల్లెక్కడో చూపు"

"మరి నాన్నారూ మా అమ్మతో మాట్లాడం లేదా? అంతా చెప్పేస్తావు... తీసుకొచ్చేదివిదో అన్నీ తీసుకొనిరా" తిని వెళ్ళిపోతాను"

ప్లీడరుకి ఉత్సాహంపోయి నిరుత్సాహం వచ్చింది. అమాయిక పిల్లతో ఏమిటి మాట్లా

డడం! ఎన్ని జవాబులు చెపుతుంది. ఆన లెవరింటి అమ్మాయి! ఏ వూరో!...

"సరే... నేవెళ్ళిపోతా...మా అమ్మతో నువు ఒకవేళ చెపితే...అన్నీ అబద్ధమని చెపుతాను. నీకేదెబ్బలు తగుల్తాయి"అంటూ తుఱ్ఱుమని పారిపోయింది లలిత. ప్లీడర్ బాబుకి ఆశ్చర్యమయి వాకిటవరకూ వచ్చాడు. కానీ లలిత అవుపించలేదు. కానీ లలిత మూర్తి, మాటలు ప్లీడర్ గారి హృదయంలో హత్తుకొనిపోయింది. పిల్లలు ఎంత అమాయకులు! ఎంత నిర్మల హృదయులు. భేదం లేకుండా మాట్లాడుతారు.. ఎంత మర్చిపోదామన్నా ఆ విషయాలు ప్లీడర్ గారి కండ్లకు దూరం కాలేదు.

## 2

ఇంటికి రాగానే మొదట కనిపించిన నాన్నగారితో లలిత "నాన్నోయ్! నాదేం తప్పులేదు. అక్కయ్య విడిచి వెళ్ళిపోతే-నే నేడుస్తో నిలపడితే...ఆ సూటునాన్న లోపలికి తీసుకెళ్ళి బిస్కట్లు ఇచ్చాడు. ఇల్లు కనుక్కొని అమ్మతో చెపుతాడేమో! నే నేం మొదట అడగలేదు నాన్నా బిస్కట్లు..." అన్నది గబగబ.

చిన్నకూతురి మాటలు మేజస్ట్రేట్ వారికేం అర్థమే కాలేదు.

ఎవరా సూటు నాన్న? ... ఆ మాట తల్చుకొంటే కొద్దిగా కోపం వచ్చింది. ఛీ! ఎవరే సూటునాన్న?" అన్నాడు. లలిత అన్నది "బిస్కట్లు ఇచ్చిన సూటు నాన్న..."

"ఛీ... ఎవరే అంటే...మళ్ళా సూటు నాన్న...ఏ ఇల్లు..."

"సూటునాన్న ఇల్లే ...వాళ్ళిల్లు ఇందాక ...అక్కయ్య......"

నరసింహానికి నిజంగా ఆత్రం, కోపం ఎక్కువయింది "ఛూ...మళ్ళీ అదేమాట.. తన్నులుతింటావు ఇలా మాట్లాడితే"

లలిత బిక్క మొగం వేసింది. మరెట్లా చెప్పడం? అమ్మకు ముందు నాన్నకే కోపం వస్తోంది సూటునాన్న దగ్గర బిస్కట్లుతిన్నందుకు.

"ఆయన పేరేమిటి?" కోపంగానే అడిగాడు నరసింహం.

"అమ్మకు తెలుసు"

నరసింహం కోపం మిన్నుముట్టింది. "ఎవరు?...అమ్మకేం తెలుసు?"

ఇంతలో తండ్రీ, కూతుళ్ళ సంవాదం వింటూ ఆవిడే ఇవతలపడ్డది.

"ఏమిటే లలితా...అర్థం కాకుండా వాగుతున్నావు?" అని ఆవిడా వురిమింది.

లలితకేం అర్థం కాలేదు "నాన్నారి పేరు అడిగాడు నీకు తెలుసన్నాను"

భార్యాభర్తలు ఒకరిమొహం ఒకరు చూసుకొన్నారు సంగతి గ్రాహ్యం కాక. ఆ పిల్లానాలుగేళ్ళు నిండీ నిండంది. మాటలా జోరుగా వున్నయ్!

"నాన్న పేరు అయితే నాకు తెలుస్తుంది కానీ...నీకు బిస్కట్లు ఇచ్చినాయన పేరు నాకెలా తెలుస్తుందే?" అని జాడించింది ఆవిడ. మొదటనుంచీ అంతా విందేమో?

"మరి నాన్నారిపేరు నీకు తెలుసుగా ...నీతో మాట్లాడడటంలే. జగడం వేశావా అమ్మా?"

సూటు నాన్న మంచివాడు! బిస్కట్లు మిఠాయి, బొమ్మలుఅన్నీ తీసిస్తానన్నాడు. దంపతులకు గుండె వేగంగా కొట్టుకొంది. లలిత మాటలు ఒక్కటీ అర్థం కాలేదు నరసింహం విసుక్కొని "ఎవతే వాడు సూటునాన్న...నీ తాడు నాన్న...నీ



ఊహాలు తెలిసీ తెలియని ఈడులో అమ్మాయి మాటలు ఒక్కొక్క ప్పుడు సంసారంలో ప్రమాదకర గా పరిణమిస్తాయి.

మాటలూ నువ్వు...ఏడ్చినట్లుంది. అన్నట్లు ఎక్కడికి వెళ్ళింది ఇప్పుడు లలిత?" అన్నాడు.

"వద్దంటే కూడా వినక మారాం చేసి జానకితో బడికెళ్ళుతానని వెళ్ళింది. ఏమే లలితా...బడికెళ్ళలేదూ? జానకి ఎక్కడ? ఇందాకటినుంచీ ఎక్కడున్నావు...సరిగ్గా చెపుతావా లేదా? చూడు...దెబ్బలు పడుతుంది" అని వురిమింది అమ్మ చెయ్యాడిస్తూ కోపంగా.

"నేను బడికిపోలేదు. నూటు నాన్నింటికి వెళ్ళాను"

నరసింహం నొసలు బాదుకొని తనగదికి దారితీశాడు. అమ్మ వు నూరుమంది. ఎవరాయన? నూటువాన్నట బడిలో అందరూ ఆడవాళ్ళేగా? జానకితో లలిత అసలు బడికెళ్ళిందా లేదా?...అన్న సందేహాలతో తలనొప్పి పుట్టించుకుని కూచుంది.

నరసింహం అట్లహాసంగా వెళ్ళిపోయారు. తర్వాత లలితని పిలిచింది ఆమె

"ఎవరింటికి వెళ్ళావమ్మా?" అని బుజ్జగింపుగా అడిగింది.

"నూటు నాన్నింటికి..."

లలిత చెంప చెళ్ళుమంది. లలితరాగాలాపనతీసింది "ఇంకెప్పుడూ బిస్కట్లు తిన్ను...ఎప్పుడూ వెళ్ళనే నూటు వాన్నింటికి..."

ఆమె కోపం ఎక్కువే అయింది. మరోటి అంటించి "ఆ మాట అనవాకు... నిన్నెందుకటాలే. జానకి...దాని పని ... నూటు నాన్న పనిచెపుతా" అంది.

లలిత ఏడ్పు కొద్దికొద్దిగా ఆపింది. తల్లికి తల కొట్టేసినంత అవమానంగా వుంది. వంట కూడా ఏమీ తోచలేదు.





కాలు కాలిన పిల్లిలా ఇల్లంతా తిరిగింది. లలితకి తోచలేదు. ఇంకాసేపు వుండి వుంటే బొమ్మలు, మిఠాయి, బిస్కట్లు అన్నీ వచ్చేవి. అమ్మ దగ్గరికి పోవడం కూడా భయమేసింది. అలాగే నాన్నగారి గదిలో నిద్రపోయింది.

## 3

"లలితని ఎక్కడ విడిచి వెళ్ళావ్?" జానకిరాగానే అమ్మ వురుముతో అడిగింది.

జానకి తిక్కమొగం వేసింది. పాడు మతిమరుపు 'హాచ్...హాచ్...' తుమ్ముకొని ముక్కు నలుపుకొంటూ అమ్మవేపు జాలిగా చూచింది.

మళ్ళా "లలిత ఎక్కడికెళ్ళింది."

"ఇదిగో వున్నా...' అంటూ వచ్చి నిలుచుంది లలిత.

"మరేమో...మన పక్కిల్లు కాక ఆ పక్కింటి వాకిట రానని మారాం వేసిందే"

అమ్మకు జ్ఞాపకం వచ్చింది. ఎవరూ ప్లీడర్ బాబా? అవును. ఆయన చెప్పేదూ నూటు విడవడు. అమ్మయ్యా. ఆయన కూతురికి ఏమాత్రం పరిపడదు. పిల్లను పిలిచి కాఫీ అని అవమానం చేద్దామనుకొన్నాడు. ఆ కొంగ కాళ్ళు...నమ్మడి కాయముఖం.

"నూటు నాన్నని చెప్పించాడా.. ఛీ.. వాని బతుక్కి మంగళంపాడా!

"పదేవెళ్ళండి" అని పిల్లలకు ఆజ్ఞయిచ్చి ఆమె అక్కడే కూలబడ్డది. జానకి అదే చాలనుకొని పెరటిలోనికి గంతేసింది. లలిత బిస్కట్లు విషయమే ఆలోచిస్తూ వాకిట్లో వొచ్చి నిలబడ్డది.

లలిత పారిపోయినప్పటినుంచీ ప్లీడరుగారికి కలే దిగులు. ఎవరా అమ్మాయ్! ఏ ఇంట్లో దూరింది. ఆ వీధిలో వతిపార్లయిసా వచారు చేశాడు. అంతు దొరకలేదు. పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి రిపోర్టు ఇద్దామని ఆఖరిసారి అనుకొని వస్తున్నాడు. వాకిట్లో లలితని చూచి అమితానందపడ్డాడు. భయపడ్డాడు. అరెరె ఇది నరసింహం ఇల్లు కదూ! సింహం కూతురేమిటి లలిత. ఓ!... వాకిట్లోనే నిలబడి

"లలితా ఇదేనా మీ ఇల్లు" అని అడిగాడు మెల్లగా.

లలితేం జవాబు చెప్పలేదు.

"మీ నాన్నగారు లోపల వున్నారా?" మరలా అడిగాడు ప్లీడరు.

"మా అమ్మ వుంది"

ప్లీడర్ వులిక్కిపడ్డాడు. లలితతో సాహసం మంచిదికాదని మనసుకి తట్టేగానే అక్కడినుంచి ఇంటికి తిరిగాడు. వెలుపల లలిత వున్నది చూచి అమ్మ వచ్చింది. ఈ మాటలు వింది. ప్లీడర్ తిరిగిపోవడం చూచి కోపం ఓర్చుకోలేక "ఏమండోయ్!" అన్నది గట్టిగా.

ప్లీడర్ బాబు అదిరిపడి సమాళించుకొని తిరిగి చూచాడు.

"అసలు మీకు పిల్లలతో మాట్లాడ్డమన్నా తెలుసా? అలాంటప్పుడు వూరుకోవాలి. మీరు ఎంత అవమానం చేయ చూచినా... నిప్పుకు చెదలుపట్టదు."

ప్లీడర్‌కు లలిత మాటలు ఎంతవరకు అర్థమైందో అంతే అర్థమైంది లలిత అమ్మ మాటలు. అక్కడ నిలిస్తే పరువు దక్కదు. అమాయిక లలిత ఏం చెప్పిందో?

"బిస్కట్లు పెట్టి పిల్లలకు మాటలు నేర్పించి పంపినంత మాత్రాన ఇక్కడ ఎవరూ చెడిపోరులెండి. రావే లలితా లోపలికి" అమ్మ వురిమింది వురుముకుమల్లే.

ప్లీడర్ అవమానం మింగుకొంటూనే నడిచాడు. లలిత ఎంత పని చేసింది. సమయం.. పన్నెండుగంటలు...లేదా జనం ప్రోగయి ఎంత అవమానం.........తానసలు లలితతో అలా మాట్లాడింది తప్పు. అదా నాలుగేళ్ళది.. అందర్నీ ఒకరిగా అనుకోనే అమాయిక...

ఇంటికిరాగానే భార్యా రత్నాన్ని పిలిచి అంతా చెప్పాడు. ఆవిడ ఆర్భాటం లేకుండానే అన్నది "నాకప్పుడే తెలుసు. మరి అంత చిన్న పిల్లతోనా మీ ప్లీడర్ ప్రశ్నలు..." ప్లీడర్ భార్యవేపు వురిమి చూశాడు. ఆవిడ చలించలేదు. పైపెచ్చు నవ్వుతూ "మీ దగ్గర ఏం జవాబులు చెప్పిందో...అలాగే ఇంట్లోవాళ్ళు అడిగి వుంటే చెప్పి వుంటుంది. అందులో అమ్మాయి తప్పేముంది?" అన్నది ఖంగున.

"ఆ అమ్మాయిని లోనికి తెచ్చింది నా తప్పే" ఒప్పుకొన్నాడు ప్లీడరు.

.....................

నరసింహం రాగానే జరిగిందంతా చెప్పింది ధర్మపత్ని. ప్లీడర్ బాబు కావాలనే అంతా చేశాడని...ఆ ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయారు నాలుగు రోజులకంతా... జరిగిన అవమానం తమకో...ప్లీడర్ బాబుకో ఆ విషయం తెల్సుకోకుండా. ★

# రెండు మహానగరాలు

(15-వ పేజీ తరువాయి)

పదంలో ఇమిడి వున్నయ్ దాని అర్థం ఏదైనా కావచ్చు— అమ్మాయ్!'—

అతను చెప్పినమాటల్లో ఏ వొక్కటీ ఆవిడ చెవులబళ్ళేదు కుర్చీలో కూర్చున్నది కుర్చీలోనే స్థాణువులా గడ్డ కట్టుకు పోయింది మన స్స్రృహాలో లేదు తెరచినకళ్లు తెరిచినట్టుగానే వున్నయ్; చూస్తున్న చూపులు, చూస్తున్నట్టుగా అలానే నిలబడి పోయినై—చిత్రపటంలోని రేఖలు మాదిరిగా అతని మనికట్టును పట్టుకునివున్న వ్రేళ్లు అలానే బిర్రబిగుసుకుపోవటంచేత, విడిలించుకోవటానికి ప్రయత్నించితే విరిగిపోతాయేమోనని భయం వేసి, అలాగే నిల్చుని కంగారుగా అరిచేశాడు

ఆ కేకలు విని, ఒక స్త్రీ లోపలికి పరుగెత్తుకొచ్చి లారీవంక తినేసేటట్టు ఉరిమిచూచింది ఎర్రటి ఉక్కు దేహం, రాగిజుట్టు, తొడుక్కున్న దుస్తులు శరీరంచుట్టూ రబ్బరుతొడుగులా కద నొక్కుకునుంది. లోపలికి వచ్చి రావటమే లారీ ఛాతీమీద చెయ్యివేసి ఒక తోపుతోసింది ఆ దెబ్బతో గాలిలోకి ఎగిరి వెనకనున్న గోడకుపోయి కొట్టుకున్నాడు 'అయ్యో బాబోయ్! యిది ఆడది కాదల్లేవుంది' అనుకున్నాడు లారీ, గోడపక్కని కుదబడి వదుం సవరించుకుంటూ

ఆ స్త్రీ, చుట్టూ మూగిన నౌకర్లవంక చూసి అరుస్తోంది:

'ఏంవిట్రా వెధవల్లారా! అట్టా తెల్లమొహాలు వేసి నావంక చూస్తున్నారేం? నా మొహానేవన్నా వక్క్రతాలు మొలిచినయ్యా? ముందు పరుగెత్తరేం? స్మెల్లింగ్ సాల్ట్ తీసుకురండి—ఓ కేయ్! ముందు చన్నీళ్లు తే—సారాసీసా ఎక్కడరా?'—

ఆ స్త్రీ స్పృహతప్పివున్న ఆ యువతిని తీసుకుపోయి సోఫామీద పడుకోబెట్టి—'నా కనకమే! నా కొసులే!' అంటూ లాలించుతోంది

'ఇదిగో! ఇటు చూడు!'— లారీవంక చూసి గర్జించింది. 'నీకు మతుందా లేదా! ఆ చెప్పే దేదింటో శాంతంగా చెప్ప గూడదూ—పిల్లని హడలగొట్టి ప్రాణాలమీదికి తేకపోతే!— ఇదేనా నీ బ్యాంక్ తెలివి?'—

ఆ ప్రశ్నకి లారీ యేవిఁ సమాధానం చెబుతాడు? నోరు మూసుకు నిల్చున్నాడు తన అవివేకానికి తనే లోలోపల ఎంతో బాధపడుతున్నాడు. ఇంతలోనే ఆ స్త్రీ, తూలిగిల బడిపోయిన ఆ యువతిశిరస్సును ఆప్యాయంగా భుజంమీదికి తీసుకుని లాలించుతూ క్రమక్రమంగా స్పృహాలోకి తీసుకువస్తోంది.

'ఇక ఫరవాలేదనుకుంటాను' అన్నాడు, లారీ, గజగజలాడుతూనే

'చాల్లే నిరవాకం—బలేవాడివి—'

'మీరు కూడా యీవిడతో ఫ్రాన్సుకు వస్తే బాగుంటుంది'

'ఎట్టాగూ వస్తాను ఒకరు చెప్పే దేవిఁటి—ఏవిఁటి నీ ఆలోచన—ఎక్కడికీ కదలకుండా ఈ లంకలోనే పడుండాలని చెపుతూ నా నొసట వ్రాశాదంటావా యేవిఁటి?'

మరో గడ్డుప్రశ్న—వ్రాశాడో లేదో ఆ విషయం లారీ మాత్రం ఏవిఁ తెలుసు? నోరు నొక్కుకుని దూరంగా పోయి నిల్చున్నాడు.





భారత రిపబ్లిక్ అధ్యక్షుని బహుమానము లందుకొన్న నలుగురు సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు: ఉస్తాద్ ముస్తాక్ హుస్సేన్, అరైకుడి రామానుజ అయ్యంగారు, ఉస్తాద్ అల్లా ఉద్దీన్ ఖాన్, కరైకుడి సాంబశివఅయ్యర్.

# పేద పెద్దరికం

(రంగంమీద నారాయణరావు)

నారా: వదినా! వదినా! శకుంతల వదినా! (లోపల్నుంచి)

శకు: ఎవరు వారు? వస్తున్నా! (శకుంతల ఈవలికొచ్చి నారాయణరావుని ఎగాదిగా చూస్తోంది.)

నారా: నేనూ, నారాయణరావుని వదినా! నన్నప్పుడే మర్చిపోయావా? మీరిక్కడుంటున్నారని...

శకు: ఎవరూ?! నారాయణరావూ!... ఇదేమిటిలా వచ్చేవు? మా వూరు. ఆశ్చర్యంగావుందే! దారితప్పి రాలేదు గదా!—రా! లోపలికిరా! మీ అన్నయ్య ఇప్పుడే అవతలి కెళ్లారు.

నారా: రావడానికో కారణం వుంది. లక్ష్మీనారాయణ జమీందారుగారు లేరూ? ఆయన వ్యవహారం మీద వచ్చాను.

శ: ఎలాగైనా మీరూ, మీరూ జమీందర్లబ్బాయ్! ఇదిగో! ఇలా చూశావా? నా బోడి మెడ అన్నదమ్ములంతా పంపకాలు తెగతెంపులు చేసుకోగా—ఇదిగో మాకొచ్చిన వాటా—ఈ గదీ-వంటిల్లూ-ఇంతేనయా.

నారా: మీ ఆయనేం చేస్తున్నాడు?

శకు: ఆయనకేం లోకజ్ఞానం లేదురా బాబూ! వట్టిఅమాయిక పుటక. నువ్వెరగని విషయం గనకనా? ఇదిగో కోటలు పెట్టారుగా—నా చేతి గాజులు లోలాకులుతో ఎత్తుకుపోయింది. ఇప్పుడు తిని కూర్చోడం క్రిందనే వుంది మా వ్యవహారం! ఆయనకి ఇంటి గొడవేంపట్టదు. కాలు గాలిన పిల్లిలా తిరుగుతుంటారు ఊరు ఊరంతా—అన గూడదు గాని—ఆయనంత అప్రయోజకుడు లేడంటే నమ్మ—ఈ గుళ్లో ఎల్లా షడ్డానో గాని—కాస్తంత నైవేద్యం కూడా పెట్టే పూజారి కాడంటే నమ్మ.

నారా: అయిపోయిందానికేం చేస్తాంలే! నీ పెళ్లి కొచ్చినప్పుడే అనుకున్నా.

శ: చూశావా మరి! వంటో సుఖం కూడా లేదు.

నారా: నీకు పిల్లల్లేరా?

శకు: అంత అదృష్టంకూడానా?

నారా: ఆఁ ఎవరూ పుట్టలేదూ? పెళ్లయి పదేళ్లయినా. ఇక నే వెళ్లొస్తా వదినా! అక్కడ జమీందారుగారు నా కోసం చూస్తుంటారు.

శకు: మతిపోయిందేవిటి ఇప్పుడొచ్చావో లేదో అప్పుడే వెళ్లిపోతానంటున్నావు. ఈవేళిక్కడే వుండాలి రేపు ప్రొద్దుటే వెడుదువుగాని...కాఫీ తెప్పించనా?

నారా: అయితే మీ కాస్తేం లేదన్న మాట.

శకు: ఆస్తేముంది? అస్తులూ అవపిండీని మీ అన్నయ్యకు నేనాస్తీ-నాకు మీ అన్నయ్యాస్తీ...

## "రమణశ్రీ"

(రామలక్ష్మమ్మ వస్తుంది)

రామ: ఎవరే? ఈ అబ్బాయి?

శకు: ఏమత్తయ్యా! ఇతను మా నాన్న చెల్లెలు కొడుకు ఎప్పుడో చిన్నప్పుడు పెళ్లి కొచ్చాడు-ఇదే రావడం మళ్లీ... మొన్న పెళ్లికెళ్లినప్పుడు వీళ్లింటికే వెళ్లాం కంచుకోటలాంటి ఇల్లు. ఎంత ఆస్తను కున్నారు. అత్తయ్యా వీళ్ల ఆస్తిలో మన ఆస్తి లక్షోవంతనుకోండి!

రామ: అలాగటే! అయితే నీ చెల్లెలు సుఖపడుతుందన్న మాటే! ఏవయ్యా! మేనరికం చేసుకోవూ?

శకు: మన సంబంధాలు పనికొస్తాయా? వాళ్లంతస్థూ, మన అంతస్థూ...ఆకాశానికీ పాతాళానికీ ముడిపెట్టడం కాదటండీ... ఏం నారాయణరావ్! మా చెల్లెల్ని చేసుకుంటావా? నాకంటె చాలా బాగుంటుంది ఎర్రగా...

నారా: అవన్నీ ఇప్పుడెందుకులే! నాకు మావాళ్లప్పుడే పెళ్లి తలపెట్టారు...

(సుబ్బారావు వచ్చాడు.)

సుబ్బారావు: ఎవరెవరూ? పెళ్లి పెళ్లంటున్నారూ?

శకు: అప్పుడే మర్చిపోయారుటండీ? అమలాపురం పెళ్లికెళ్లినపుడే వీళ్లింటికే కదండీ మనం వెడత-అయ్యోయ్యమంద మరుపా-

సుబ్బా: కాఫీ అన్నా త్రాగారా? ఏవే ఏవన్నా టిఫినన్నా తెప్పించావా? అన్నట్టు ఇలా ఎక్కణ్ణుంచి వస్తున్నారు? మంచం అలా వాల్చవే కూర్చుంటారు? ముక్కాలిపీటమీద కూర్చో పెట్టావేం? కుర్చీ అన్నా లేదండి మాయింట్లో ఇదీ... మా బీద సంసారం...

శకు: జమీందారుగారి దగ్గరికివచ్చారట. ఓ మాటుల ఈ బీద వదినెని కూడా చూసి పోదామని...

నారా: ఎవరికి వాళ్లు బీదవాళ్లెప్పుడూ కారులే వదినా!

సుబ్బా: స్నానం చేస్తారా?

నారా: నుయ్యెక్కడుంది ... వంటో కాస్త బద్ధకంగా వుంది...

శకు: ఆ అబ్బాయి నివ్వాళుండ మన్నాం. బియ్యం లేవు.

సుబ్బా: నిన్నే గాదే బియ్యం తెస్త.

శకు: నడిపోయింది. గుడ్డు పెట్టినట్టే! ఆ ఎర్రకోటా కోణా మణి బియ్యం అతనేం తినగలడండీ? నూనె...సెనగపిండి...పంచదార...సగ్గుబియ్యం తీసుకురండి...

సుబ్బా: చంపావురా. దేవుడా! ఇంట్లో దమ్మిడీ కూడా లేదు...అప్పిచ్చే దాత కూడా లేడు మనకి...

శకు: ఇదిగో ముక్కుపుడక తీసుకెళ్లి తీసుకురండి...షావుకారు దగ్గర పెట్టుకు రండి...ఆకులు కూడా లేవు...వెళ్లిరండి.. సిగరెట్లు అలవాటుకావును. అవికూడా... కదలండి కదలరేం,

(లోపల్నుంచి "సబ్బుబిళ్లిచ్చావుటే?")

శకు: అన్నట్టు నా మతి మండిపోను. సబ్బుబిళ్ల తెచ్చిపెట్టండి...

సుబ్బా: అందరికీ నా మీద పగేరా దేవుడా...వీడెందు కొచ్చాడురా మమ్మల్ని తోమడానికి.

శకు: ఇవ్వాల్టికొక్కరోజే...లేకపోతే గౌరవం నిలబడదు...పరువు నిలపండి.

(వెళుతోంది)

సుబ్బా: వీళ్లని గౌరవించకపోతే మాకు గౌరవం దక్కదు. మంచి శ్రీరంగనీతే!

(వెళుతున్నాడు)

## 2

(తెర వెనక)

శకు: నీవు తోమమంటావా? నారాయణ రావూ.

నారా: అక్కర్లేదులే!

శకు: రేపు పెళ్లయినా ఇంతేనా? సిగ్గు పడకు.

(తెరముందు)

సుబ్బా: అకస్మాత్తుగా ఈ నారాయణరా

వొచ్చి నా వీపు తోముతున్నాడు. ఆ జమీందార్లింటికి పోతున్నా వాణ్ణి ఇదెందుకు వద్దనాలి. దీనిదో పెద్దరికం వెలగబెడుతోంది. ఇంతటితో సరిపోయింది.

(రామలక్ష్మమ్మ వస్తూ)

ఏవిట్రా 'ఎవడో వస్తే వాడితో దీనికే విట్రా సరసాలు. ఆ అబ్బాయి సెమ్మదైన వాడు గనక సరిపోయింది. లేకపోతే

సుబ్బా : లేకపోతే లేపుకు పోతాడా? పొమ్మనుకనే వొదులుతుంది.

రామ : ఏవిటా మాటలు. నాకెందుకులే మధ్య... రేపెవళ్లొచ్చినా అంతేనా? మంచీ మర్యాదా లేకండా...

(లోపల్నుంచి శకుంతల)

ఏవండోయ్! క్రొపు దువ్వనేది? ఉంది లెండి...నువ్వు దువ్వుకుంటావా? నేను దువ్వనా నారాయణరావ్.

సుబ్బా : అంత చనువుగా వుందే!

రామ: చిన్న పిల్లాడేకదరా, ఫరవా లేదులే

(అవతలింటి నుంచి సుగుణావతి వస్తూ)

ఏవండోయ్ ! రామలక్ష్మమ్మగారూ? మీ యింటికి చుట్టాలొచ్చారట — చూడొచ్చా?

రామ : చూడ్డానికేం ఏనుగెక్కొచ్చాడనుకున్నావా? ఊరేగుతో వచ్చేడనుకున్నావా పిచ్చిపిల్లా...

సుగు : మా చిన్న చెల్లి ఇందాకణ్ణుంచీ ఒకటే గొడవ...బూట్లబ్బాయొచ్చాడో వాళ్లింటికి...నల్లని కోటదీ తొడుక్కున్నాడే...కళ్లజోడదీనీ..అని ఒకటేసొద.. ఏవూరేవిటండీ?

రామ : ఏదో వూరట.

(శకుంతల లోపల్నుంచి వస్తూ)

నువ్వా సుగుణా? మా మరిదొచ్చాడు.

(నారాయణరావు ఈ మాటలు వింటూ ఇవతలికొచ్చాడు)

(నిశ్శబ్దం)

శకు : వీళ్లత్తారూగూ కాకినాడే పండుగలుకదూ పుట్టింటికొచ్చింది.

నారా : అలాగా?

సుబ్బా : కూర్చోండి.

(నారాయణరావు కుక్కినులక మంచం మీద కూర్చోడానికి సందేహిస్తున్నాడు)

శకు : ఇదే మా బతుక్కి హంసతూలికా తల్పం నారాయణరావూ! కూర్చోవాలి తప్పదు...ఓ మాటు కుర్చీ తెచ్చి పెడతావా సుగుణా మీ యింటోది.

సుగు : అది మాత్రం వుండొద్దకో. (తెస్తానని వెడుతోంది)

రామ : మా వాడే ఉద్యోగం చెయ్యలేదు నాయనా. ఆఖరికి ఉప్పూ చింతపండు అమ్ముకొనే కోమటి కొట్టుమీద పద్దులు కూడా రాయలేక పోతున్నాడు. చిన్నప్పణ్ణుంచీ గారాబం బాబూ గారాబం. ఆయనున్నన్నాళ్లూ ఈ చిన్న కొడుకెక్కడ కాలుతీసి కాలేస్తే జారిపోతాడో అని కంటికి రెప్పలాగ పెంచుకొచ్చారు. ఇప్పటికి నేను కాళ్లు చాచుకూర్చున్నా.

శకు : అవన్నీ ఆ అబ్బాయి దగ్గరెందుకు లెండత్తయ్యా.

(సుగుణ కుర్చీ తెచ్చి వెళ్లింది)

శకు : భోజనానికి లేవవయ్యా టైమవుతోంది.

నారా : వద్దులే వదినా! ఈ పాటికి కారెదీవచ్చే వుంటుంది. జమీందారుగారు నాకోసం చూస్తుంటారు

(ఏదో కలం తీసి రాస్తుంటాడు.)

శకు : (దూరంగా) ఏవిటది రాస్తున్నావు.

నారా : (కలం జోబిలో పెడుతూ) ఏం లేదు.

(సుబ్బారావు వస్తూ)

ఏవండోయ్! మీ కోసం జమీందారుగారు కారు పంపారు. మీ కోసం కారు.

నారా: చూశావా? వదినా కారు గూడా వచ్చేసింది వెళ్లొస్తా మరి.

శకు : అయ్యో ! నా నిర్భాగ్యం కాస్త ఫలహారం చేసి వెళ్లు. నా మాట విను... వెళ్లకు...(చెయ్యి పట్టుకుని లోపలికి లాక్కెడుతోంది)

(లోపల్నుంచి)

శకు : కాస్త పరవాన్నం తిను. మీ వదినె చేతి వంటెలా వుంటుందో కాస్త రుచి చూడు...మేం మీకు లాగ వండగలమా మరి...ఎలావుంది? కాస్త వేసేదా? మీ ఆవిడొస్తే ఇంకా బాగా వండుతుందిలే...అన్నట్టు మీకు వంటవాళ్లున్నారుగా.

నారా: బాగుంది వదినా? వంటవాళ్లుంటే మాత్రం ఇంత పరిశుభ్రంగా వుంటుందా వదినా... అదికాదు గాని ఈ పూటుండి పొయ్యేవాడికి ఎందుకింత హంగామా చేశావ్? అన్నయ్యని చాలా కష్టపెట్టావ్...అదేం వదినా నీ మొహం బోసిగా వుందే...

శకు : (నవ్వుతూ) ముక్కు పుడక నీరు దిగితే, ఇప్పుడే కంసాలి దగ్గరికి పంపించాను. కాస్త పాకోడీలు వెయ్యనా.

నారా : వద్దు.

శకు : అయ్యో! ఇదేం తిండిరా బాబు. ఒక్కటన్నా ముట్టుకోలేదూ ... నీళ్లియ్యనో...టవలిచ్చేదా?

నారా : వస్తా వదినా. మీ అందర్నీ శ్రమ పెట్టాను.

శకు : అందర్నీ అడిగానని చెప్పు. మీ అమ్మనీ అందర్నీ.. అప్పుడప్పుడొస్తే మా యింటికి రావాలి సుమా!

(అందరితో 'వెళ్లొస్తా' అంటూ వెళ్లిపోతున్నాడు)

(శకుంతల లోపలికెళ్లి చూసి) అయ్యో! నారాయణరావ్! పర్సు మర్చిపోయ్యావ్. అయ్యో...త్వరగా వెళ్లండి.. ఇచ్చేసిరండి కదలరేం?...పర్సు...

సుబ్బా : ఇంకెక్కడ అప్పుడే వెళ్లిపోయాడు.

(శకుంతల పర్సు విప్పి చూస్తూ) పాతిక రూపాయలండి. ఏదో కాగితం వుందే! (పైకి చదువుతూ) 'వదినా! ఇది నీకు నేనిచ్చే బహుమానం! '

సుబ్బా : మొత్తానికి దిట్టమైనవాడే! ఆ డబ్బిలా యియ్యి.

శకు : వెళ్లిచ్చేయండి నాకక్కర లేదు. నన్ను వెర్రిదాని కింద కట్టేసి..

సుబ్బా : ఆఁ వదినగారని అంత మోజుపడి ఇస్తే వద్దంటావేమే?

శకు : మీకు తెలీదండి రేపైనా మనియార్డరు చేసేయవలసిందే. మనమలా తీసుకోరాదండి.

సుబ్బా ' అబ్బ! ఇక్కడున్నంతసేపే ఈ మాటలన్నీ పాపం! ఏ చిరన్నా రానీ ఈ మాటలన్నీ ఎక్కడుంటాయో చూస్తాగా.

(శకుంతల నవ్వుతుంది)

(రామలక్ష్మమ్మ వస్తూ) నా కేవన్నా వాటా వుందా? లేదే?

శకు : ఎవ్వరికీ లేదు. మా నారాయణరావు నాకిచ్చాడు. (తెర) ●

# ఆకాశానికి నిచ్చెన

ఇదిగోనండీ కాంతమ్మగారూ! ఏమండీ!' అని పిల్చింది కాంతమ్మ 'రు తన యింటి ఆవరణలో నిల్చుని.

'వస్తున్నానండీ' అని ఎదురింటిలోనుంచి కాంతమ్మ బయటికి వచ్చి 'ఎందుకూ' అని అడిగింది.

'ఇలా ఒకసారి వస్తారూ' అన్నది కాంతమ్మగారు ఏదో ఘనకార్యం వున్నట్లు. సరేనని కాంతమ్మ, కాంతమ్మగారి యింటిలోకి వచ్చింది 'ఎందుకండీ' అంటూ.

'ఆఁ ఏమీ లేదమ్మా. నిన్న మావారు యీ చీరెను కొనుక్కొచ్చారు. బావుందేమో అడుగుదామనీ...' అంటూ తన చేతిలోని క్రొత్తచీరెను కాంతమ్మ చేతిలో పెట్టింది. కాంతమ్మ ఆ చీరెను అట్టే అందుకుని పరీక్షించ సాగింది. గళ్ళచీర. చక్కని జరీ అంచు సూర్యరశ్మికి మిలమిలా మెరిసిపోతూ కాంతమ్మని ఎంతో ఆకర్షించింది.

'ఎలా ఉందండీ!'

'చాలా బావుందండీ. ఎంత!' అని అడిగింది కాంతమ్మ చాలా ముచ్చట పడుతూ.

'ఆఁ ఎంతండీ. నలభయఅయిదు'

కాంతమ్మ వులుక్కుపడి కాంతమ్మగారి ముఖంవయిపు తేరి చూడసాగింది. అంతకు ముందు గ్రహించలేదుగాని యిప్పుడర్థమయింది అసలు సంగతి. తనను అవమానించటానికే పని కేకపిలిచి ఆచీర చూపించింది. తమకు అంత డబ్బుపెట్టి చీర కొనే తాహతు లేదు. ఆ విషయం కాంతమ్మగారికి తెలుసు. అందుచేతనే అంత దర్పంగా పలికింది నలభయిఅయిదు అని 'మీరేం కొంటారమ్మా అంత డబ్బుపెట్టి. అవి మాలాంటి వాళ్ళకే చెల్లుతాయి' అనే అర్థం గోచరించింది.

'సరేనండీ. వెళ్తున్నాను.' అని మాత్రం చెప్పి యింటికి వచ్చేసింది కాంతమ్మ. తప్పక తనను అవమానించటానికే అలా చేసి వుంటుంది. లేకపోతే ఆమే తన యింటికి వచ్చి చూపించకూడదా? తనను పిలిచి గొప్పలు చెప్పుకోవటం ఎందుకు?

కాంతమ్మ వూహించింది కేవలం అబద్ధం కాదు. కాంతమ్మగారు నిజంగా కొంచం గర్వంగల మనిషి. డబ్బున్న స్త్రీ. ఆ విషయితే డబ్భయి రూపాయలు పెట్టి అయినా కొంటుంది చీరె. కాని కాంతమ్మ ఎలా కొనుక్కోగలదు?

ఆరోజు గోవిందరావు యింటికి వచ్చేటప్పటికి కాంతమ్మ చిన్నబోయి కూర్చుంది. 'ఏం? అలాగున్నావ్' అని అడిగాడతను.

కాంతమ్మ జవాబివ్వలేదు.

గోవిందరావు పునూరు మంటూ కాలబడి 'చెప్పు కాంతా' అన్నాడు. కాంతమ్మ అసలు సంగతి చెప్పేసింది. గోవిందరావు మాట్లాడలేక పోయాడు. నలభయిఅయిదు రూపాయలంటే తనకో ఘనం. అంత డబ్బు పెట్టి చీర కొనితేవాలా!

'ఏమంటారు?'

ఏమంటాడు?

'అది కాదు కాంతా! అంత డబ్బుపెట్టి మనం ఎలా కొనుక్కోగలం. వాళ్ళకేం? వాళ్ళు ఎన్నయినా కొనుక్కుంటారు! మనం వారితో పంతాలు పెట్టుకుంటే ఎలా చెప్పు' అని నచ్చచెప్ప బోయాడు.

కాంతమ్మ ముఖం ముడుచుకు పోయింది. తను ఎటువంటి సమాధానం అయితే వూహించుకుందో అటువంటి సమాధానమే వచ్చింది అయితే భర్త స్వభావం తెలుసుకున్నదవటంచేత కోపం వహించకుండా బ్రతిమిలటానికి నిశ్చయించుకున్నది.

'ఏమండీ తేరా?'

గోవిందరావుకు కొంచం కోపం వచ్చింది ఏమిటీ మంకుపట్టు? తమ సంగతి కాంతకు తెలిసే అలా అంటుంటే తనింకా ఏమనాలి?

'అది కాదండీ! ఒక్కమాటంటాను.

మీరు నాకు చీరకొనిపెట్టి ఎన్నాళ్ళయిందంటారు?'

అతను వూహించుకుంటున్నాడు నిజమే. రెండేళ్ళవచ్చు.

'ఇన్నాళ్ళనుంచీ మిమ్మల్ని అడగలేదు. ఇదొక్కటే నేకోరేది. ఏమండీ శాంతమ్మ ఎంతో జాలిగా అడుగుతూంది.

గోవిందరావు మెత్తబడ సాగాడు. 'అది మరో స్త్రీకి అసూయ కలగటం సహజం. శాంతమ్మకూడ స్త్రీయే. మంచి చీరెలు కట్టుకోవాలని, చక్కగా అలంకరించుకోవాలని ఆమెకూ కోరికలుంటాయి. అటువంటప్పుడు ఆమె కోరిక నెరవేర్చకుండా ఉండటం తప్పనుకున్నాడు గోవిందరావు.

'సరే. నీయిష్టం'

శాంతమ్మ ఎగిరి గంతేసింది. తన భర్త సంతోషం అతనిలో లేదు. అయినా తన కోసం నవ్వు తెచ్చుకుంటూ 'ఏం? బావుందా?' అని అడిగాడు.

శాంతమ్మకు భర్తను చూస్తే జాలి వేసింది. తను అనవసరంగా అతనికి బాధ కలిగించానేమో అనుకున్నది.

'ఏమండీ అలా వున్నారు?'

'ఏం! ఎలా వున్నాను'

# శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

కాదు శాంతా! వాళ్లు వ్యాపారులు మనం వుద్యోగులం. వారితో ఎలా సరితూగగలం చెప్పు' అన్నాడు.

'నిజమే. కాని అడక్కడక్క అడిగాను. కాంతమ్మగారు అంతలా ఆ చీరెను చూపిస్తుంటే ముచ్చటేసిందండీ'

శాంతమ్మ మాటలకు అతని హృదయం పూర్తిగా కరిగిపోయింది. నిజంగా పాపం ఆమె చాల కాలంనుంచీ ఎటువంటి కోరికా కోరలేదు తోటి స్త్రీ అలంకరణ చూస్తే యింత సులభంగా అంగీకరిస్తాడనుకోలేదు. నలభయిఅయిదు రూపాయిల చీరె తన జీవితంలో ఎప్పుడూ ధరించలేదు. ఆ చీరెతో తనువుంటే ఎంత అందంగా వుంటుందో వూహించుకో సాగింది.

భోజనం చేసిం తర్వాత గోవిందరావు పెట్టెలో డబ్బు లెక్క చూశాడు. నలభయి ఎనిమిది రూపాయలున్నయి, తను ఆరునెలలనుంచీ కూడబెట్టిన సొమ్ము. తను చాలా సార్లు యిలా కూడబెట్టటం ఏదో కారణంచేత ఖర్చయి పోతూవుండటం జరుగుతూంది.

'శాంతా! పోనీ యీ డబ్బుపెట్టి రెండు చీరెలు కొనుక్కోకూడదూ' అన్నాడు అంత డబ్బుపెట్టి ఒకేచీర కొనటానికి ప్రాణంఒప్పక.

శాంతమ్మకు యీమాట పూర్తిగా నచ్చలేదు. ఆమె వీనుల్లో యింకా కాంతమ్మగారి మాటలు ప్రతిధ్వనిస్తున్నాయి. తను అటువంటి చీర కొనుక్కొని ఆవిడకు చూపిస్తే కాని తన ఆవేశం చల్లారదు.

'నా కటువంటి చీరే కావాలండీ' అన్నది. గోవిందరావు నిట్టూర్చి సరే అన్నాడు. అతను వెళ్లేటప్పుడు శాంతమ్మ, కాంతమ్మగారి చీరె ఎటువంటిదో అన్నీ వివరాలు చెప్పింది. గోవిందరావు వెళ్ళిపోయాడు.

శాంతమ్మకు భర్తమీద చాలా ప్రేమ పుట్టుకు వచ్చింది. అతనిలో యింత మంచితనం దాగుని వున్నదని కలలోకూడా అనుకోలేదు. తను మొదట అతన్ని చీరె విషయం కోరినప్పుడు ఆశలేకనే అడిగింది. అయినా అతి విచిత్రంగా తన కోరిక నెరవేరింది.

మరో అరగంట గడిచేటప్పటికి గోవిందరావు చేతిలోని పొట్లంతో యింటికి వచ్చాడు. శాంతమ్మ గబుక్కున అది లాక్కొని విప్పింది. చీరె నిగనిగలాడుతూంది. అచ్చం. అదే చీరె, సంతోషంగా భర్త ముఖంలోకి చూసింది. తనలో వున్న

శాంతమ్మ ఏమీ మాట్లాడలేక పోయింది అంత డబ్బుపెట్టి చీరకొంటే తనకూ కాస్త బాధగానే వుంది యిప్పుడు. అయినా తను

(46-వ పేజీ చూడండి)




# ★ గానుగెద్దు ★

"రవి"

తర్కంచదివిన పండితుడు
దస్త్రాగిన్నొక ఒత్తుకొని
నూనెకోసమని యొకనాడు
గానుగవద్దకు వెళ్లాడు,
కళ్ళకు గంతలువున్నట్టి
గానుగయెద్దును చూచాడు,
గంతలుకట్టా వెందుకని
గానుగవానిని అడిగాడు,

"ఎరుగరస్వామీ ఈమాత్రం
గిరగిర, గిరగిరతిరుగుటచే
కండ్లుతిరిగి అది పడునంచు
కండ్లకు గంతలుకట్టాను."

"చక్కనిపనినే చేశావు
చతురుడవయ్యాసీ, వయితే
యింతకు మెడలో గంటొకటి
యెందులకయ్యా! కట్టావు?"

"ఎద్దును తోలీ నే నట్లా
యింట్లోపనులను చేయుదును
యెద్దు తిరుగుతూవుంటేను
యెప్పుడు మ్రోగును ఆ గంట,
గంటచప్పుడూ కాకుంటె
వెంటనె బయటికి నేవచ్చి
యెద్దును మెల్లగ అదలించి
యింట్లోపనులను చూచెదను."

"సరిసరి తెలిసినవాడల్లే
సమాధానమును చెప్పావు.
మెదలకనిలచి మీయెద్దు
మెడఆడిస్తే ఏంజేస్తావ్!"
"అంతటితర్కం మాయెద్దు
కంటలేదు మరి బాబయ్యా!"

# కలలో కలవరం



నాటితో మా ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షలు ఆఖరు. అదేమిటో గాని ఈ సంవత్సరపు పరీక్షలు బలే సులభంగా ఉన్నాయి. అసలీ పరీక్షల పేరు వింటే చాలు విద్యార్థులంతా ఎందుకో గడగడ లాడుతారు. పరీక్ష పేపర్లు వాచరు చేతులో వుండగా మాత్రం మమ్మల్ని బాగా హడలగొట్టాయి. వాటి ఆకారాలు చూచి మేము నిజంగా ప్రాణాలు వదిలేశామంటే నమ్మండి. అంత పెద్దపెద్ద పేపర్లలోని ప్రశ్నలన్నిటికీ జవాబులు వ్రాయగలమా ? వ్రాయడానికి టైముంటుందా ? — ఈరకమైన ఆలోచనలన్నీ ముసురుకు వచ్చాయి మనస్సులో. పేపరు చేతులో పడింది. ఆనందంతో ఒక్క కేక పెట్టాము. అంటే అంత సులభంగా ఉన్నదన్నమాట. అదేవిధంగా జరిగాయి పరీక్షలన్నీను. పేపర్లన్నీ బాగుగానే వ్రాశానన్న తృప్తిపడిపోయాను.

అట్టగిరగిరా తిప్పుకొంటూ పరీక్షహాలునుండి ఇంటికి వచ్చాను. నా వైఖరి చూచి ఆశ్చర్యపోతూ ఇంటిలోని వారంతా 'ఏరా? ఎలా వ్రాశావేమిటి? అంత హుషారుగా ఉన్నావు?' అని ప్రశ్నించారు. పట్టలేనిసంతోషంతో ఏమి చెప్పాలో తెలియక ఒక చిరునవ్వు మాత్రం పారేశాను. కడుపునిండా భోజనంచేసి చెరలోనుండి విడుదలైన ఖైదీకున్న సంతోషంతో మంచం వాల్చుకుని, వెల్లకిలా పండుకుని, ఈ శెలవుల్లో ఏమి చేయలా అని ఆలోచించాను.

* * *

పరీక్షఫలితాలు తెలిసేరోజు వారం రోజులలోకి వచ్చేసింది. రిజల్ట్సు అనగానే మొదటెందుకో భయపడ్డాను. భయం కాదూ మరి! బాగా వ్రాశాననే ధైర్యంతో తప్పక ప్యాసవుతాననుకున్నాను. అయినా ఓమూల ఆ భయం అలానే ఉండిపోయింది. 'నా నంబరు ఉంటుందా? ఉండదా? అన్ని నంబర్లలో పొరబాటున నా నంబరు వేయటం మరచిపోతే! నా స్నేహితులందరు ప్యాసవుతారా? నానంబరు 18, 888 ఎంత చక్కగా వరుసగా ప్రింటు చేస్తారో!'

ఉండి ఉండి ఒక విషయం జ్ఞాపకమొచ్చింది. పోయిన సంవత్సరమెంతమంది ప్యాసయ్యారో? కాలక్షేపంగానైనా ఉంటుందని పాత న్యూస్‌పేపరు కట్టలు తీశాను. ఆ కట్టలు 51 సం॥ ము మే, జూన్ నెలల పేపర్లవి. కట్టవిప్పి దొంతిలో చెయిపెట్టి ఒక పేపరు బయటికి తీసేటప్పటికి హఠాత్తుగా నాదృష్టి ఒక వాక్యంపైపడింది.

'పరీక్షలో తప్పిపోయిన విద్యార్థి ఆత్మహత్య'

ఉక్కిరిబిక్కిరయ్యాను. శుభమా అంటూ ఏదో చేయబోతే మరి యేదో అయిందట! అలాగే పేపరు తీసీ తియ్యటంతోటే ఆవాక్యమే కంట బడాలా ?...పేపర్లన్ని ఎప్పటిలా కట్టివేసి ఒకమూల విసరి వేశాను.

రిజల్ట్సు పడే రోజు శనివారం వచ్చింది. బట్టలు వేసుకొని టాయిలెట్ అయి మెయిల్ టైముకి స్టేషనుకు వెళ్ళాను. త్వరగా ఫలితాలను తెలుసుకోవాలని ఆదుర్దాగా నున్న కొందరు స్నేహితులు ముందుబండిలో ముందటి స్టేషన్‌కు చేరుకున్నారు. మెయిల్ వస్తూంది.





వారి ముఖాలు కొద్దిగా నల్లబడ్డాయి. మొదట వీరి పరీక్షలు చెట్టు ఎక్కేశాయి కాబోలనుకున్నాను. కాని సంగతి అది కాదు. ఆరోజు రిజల్ట్సు పడలేదు.

మర్నాడు స్టేషన్‌కు వెళ్ళాను. మెయిల్ వచ్చింది. పేపరుకట్టలు దిగాయి. కట్టలు విప్పబడ్డాయి. ఒక్కసారిగా వాటిపై దండెత్తారు విద్యార్థులు. నేనూ ఓ పేపరు సంపాదించాను. గబగబ వెదికాను. నంబరు కనిపించలేదు!!! గ్రుడ్లు పెద్దవి చేశాను; ఫలితం శూన్యం. ఎందుకైనా మంచిదనిమరి రెండు ఇంగ్లీషు పత్రికలు కొన్నాను. వాటిలోనైనా నా నంబరు లేదు. కాళ్ళ క్రింద భూమి కదులుతున్నట్లయింది. చేతిలోని పేపర్లు నన్ను వెక్కిరిస్తూ క్రిందకి జారిపోయాయి. నా తల్లిదండ్రులకు నా ముఖమెలా చూపగలను! ఆఖరు పరీక్షరోజున గొప్పగా అట్టత్రిప్పుకుంటూ వచ్చిన దృశ్యం కళ్ళెదుట నాట్యమాడి నన్ను వెక్కిరించింది. సిగ్గుపడ్డాను. భారంగా తూలిపోతూ నడుస్తున్నాను. విద్యార్థుల గుంపు ఒకటి నన్ను చూచి ఫకాలున నవ్వింది. ఒకానొక విద్యార్థి నా అప్రయోజకత్వానికి హేళన చేస్తూ హోటల్‌లో దూరాడు. పరీక్షలో తప్పిపోవటం అంటే ఏమిటో నాకిపుడు తెలిసివచ్చింది. ఆ పాత పేపరులోని వాక్యం చెవిలో గింగురుమన్నది. అవును! అదితప్ప నాకు వేరే మార్గం లేదు. !! ఆత్మహత్య !!! గబగబా వంతెనమీదికి పరుగెత్తాను! కండ్లు మూసుకొని



కాలవలోనికి దూకేశాను.

* * *

ఏదో బాధగా వున్నది. ముఖమెత్తి చూచాను అరె - నేను పడ్డది స్తంభాల చుట్టూ సుళ్లు తిరుగుతున్న నది నీటిలో కాదే; మంచం క్రింద- మంచం కాళ్ల వద్ద! నొసటిమీద బాగా ఆపిల్ పండంతలావు బొప్పి కట్టినా, నానొసటివ్రాత కలలో జరిగింది కానందుకు ఎంతైనా సంతోషించా. పరీక్షలను గురించి సంవత్సరం పొడుగునా ఆందోళన పడ్డ ఫలితంగానే కదా, కలలో నా మనస్సు యింత కలవరపడ్డది! పిల్లలూ - మీరుమాత్రం పరీక్షలంటే ముందుగానే భయపడకండి.



# హకల్ బెరీ ఫిన్

## మార్క్ ట్వేన్

### బొమ్మరిల్లు సీరియల్

**17**

కుక్కల మొరుగుడు వినగానే ఇంట్లో వాళ్లు మేలుకున్నట్టున్నారు ; కిటికీ తలుపు చాటున దాక్కుని ఒక రెవరో ప్రశ్నించారు:

"ఏయ్, ఎవరక్కడ ?"

"నేనే నండి."

"నేనంటే"

"నాపేరు జార్జి జాక్సన్"

"ఏం కావాలి నీకు ? ఎందు కొచ్చావిక్కడికి ?"

"ఏమీ అక్కర లేదండి. నాదోవన నేను పోతుంటే మీ కుక్కలు అటకా యిస్తున్నా యండి."

"ఈ అర్థరాత్రప్పుడు మా ఇంటి దగ్గరేం చేస్తున్నావు ?"

"మీ ఇంటి దగ్గరేమీ చెయ్యటం లేదండి. ఇందాక ఒక పొగబోటులో ప్రయాణం చేస్తూ నీళ్లల్లో పడి పోయానండి."

"అల్లాగా ? నిజంగా నేనా ? పెద్ద దీపం వెలిగించండిరా. వీడెవడో కొత్త వాడొచ్చాడు మనింటికి. ఆ, నీ పేరేమి టన్నావు ?"

"నాపేరు జార్జి జాక్సన్ అండి. చిన్న కుర్రాణ్ణి."

"ఇదిగో, నువ్వు చెప్పేది నిజమే అయితే నువ్వేమీ భయపడ నక్కరలేదు. కదలకుండా అక్కడే నుంచో. అరేయ్ బాబ్, టామ్‌ను లేపండిరా. రెండు తుపాకులుకూడా తీసుకు రండి. జార్జి జాక్సన్! నువ్వొక్కడి వేనా? నీతో ఇంకెవరన్నా ఉన్నారా ?"

"ఒక్కణ్ణే నండి సార్. ఇంకెవరూ లేరు."

ఇంతలో ఇంట్లో చాలమంది మనుషులు అలికిడి అయింది. పెద్ద దీపం వెలిగించ బడింది. ఇందాకటి ఆయన గొంతిక మళ్ళీ వినిపించింది!

"ఆ దీపం తలుపుచాటున పెట్టండి. బాబ్! టామ్! మీరు తుపాకుల్తో రెడీగా ఉన్నారా ?"

"అంతా రెడీ!" అని రెండు గొంతుకలు సమాధాన మిచ్చాయి.

"సరే. జార్జి జాక్సన్! నీకు షెపర్డ్‌సన్ కుటుంబం తెలుసా ?"

"తెలియదండి. వాళ్ల పేరే ఎప్పుడూ విన లేదు," అని జవా బిచ్చాను.

"కావచ్చు. కాకపోవచ్చు. సరే. రెడీ! జార్జి జాక్సన్! ఒక్కొక్కడుగే ముందుకురా. నెమ్మదిగా. తొందర వద్దు. నీతో ఎవరన్నా ఉంటే వాణ్ణి పొమ్మను. ఇంకొక డెవడు కనిపించినా వాడి ప్రాణాలు దక్కవు. రా. నెమ్మదిగా. తలుపు మెల్లిగా తొయ్యి. కొంచెం తెరు. నీ తలకాయ మాకు కనిపించే టంత మాత్రమే తెరు. ఏం, వినిపిస్తోందా ?"

అంతా నిశ్శబ్దం. ఒక్కొక్క అడుగే వేస్తూ మెల్లెక్కాను. కుక్కలూ, వాటి యజమానులూ అంతా గప్ చిప్. ఊపిరి బిగపట్టి నాఅడుగుల చప్పుడు

వింటున్నారు. రెండు మూడు మెట్లెక్కాక తలుపు తాళం తీస్తున్న సడి వినబడింది. ఇంకో మెట్టు ఎక్కాను. తలుపుగడియ తీయబడింది. ఆఖరి మెట్టె క్కాను. తలుపుకు అడ్డంగా బిగించబడిన కడ్డీకూడా తీయబడింది. తలుపు కొద్దిగా తోశాను. ఇంకా కొద్దిగా తోశాను. ఇంతలో ఎవరో అన్నారు:

"ఆ, చాలు. నీతల లోపలికి పెట్టు."

తల లోపలికి పెట్టాను. తలుపు పక్కన దీపం ఉంది. వాళ్లు నాకేసి, నేను వాళ్లకేసి చూసు కున్నాము. వాళ్లలో ముగ్గురు మనుషుల చేతుల్లో తుపాకు లున్నాయి. అన్నీ నాకేసి గురిపెట్టి ఉన్నాయి. అదృశ్యం చూసేసరికి పైప్రాణాలు పైనే ఎగిరిపోయాయి. ఆ ముగ్గురిలో అరవైఏళ్ల వృద్ధు డొకాయన ఉన్నాడు. మిగతా ఇద్దరు ముప్ఫయిఏళ్లు పైబడినవాళ్లు. ఇంకా లోపల నెరిసిన జుట్టుగల ఒక నడివయస్సురాలు, ఆమె వెనక ఇద్దరు సుందరమైన యువతులు ఉన్నారు. వృద్ధుడు అన్నాడు:

"చాలు. ఇక లోపలికిరా."

నేను లోపలి కడుగు పెట్టగానే వృద్ధుడు తలుపుకు తాళం, గడియ, అడ్డకడ్డీ అన్నీ జాగ్రత్తగా మళ్ళీ వేసేశాడు. అంతా నన్ను చుట్టుముట్టారు. వృద్ధుడు దీపం ఎత్తి పట్టుకుని నన్ను పరీక్షగా చూశాడు. "అబ్బే ఈ అబ్బాయి షెపర్డ్‌సన్ వాళ్ల బ్బాయికాడు," అన్నాడు. కాదని అంతా ఒప్పు కున్నారు. నాదగ్గిర ఆయుధా లేమైనా ఉన్నాయేమో నని సోదాచేశారు. అప్పటికి గాని వాళ్లు స్థిమిత పడ లేదు. నన్ను ఏమీ భయపడ వద్దని, నిబ్బరంగా ఉండవచ్చు ననీ హామీ ఇచ్చారు. తర్వాత తల నెరి సిన ఆవిడ ఇలా అంది:

"పాపం ఆ అబ్బాయి బట్టలన్నీ తడిసి, ముద్దగా ఉన్నాయి. ఆకలిగా కూడా ఉన్నాడేమో!"

"అవునవును," అన్నారు మిగతా వాళ్లు.

ఆవిడ ఒక నీగ్రో ఆడబానిసని పిలిచి "బెట్సీ! నువ్వు వంటింట్లోకిపోయి ఈ అబ్బాయి కేమైనా తింటానికి తీసుకురా. (ఇద్దరు యువతుల్లో ఒకమ్మా యిని పిలిచి) అమ్మాయీ! నువ్వుపోయి బక్‌నులేపూ. అ అదుగో వాడే వచ్చాడు. బక్! ఈ అబ్బాయిని నీ గదిలోకి తీసుకుపోయి ఆ తడి బట్టలు విప్పేసి నీ బట్టలేమైనా ఇయ్యి. కట్టు కుంటాడు." బక్ అనబడే ఆ అబ్బాయి సరిగ్గా నాయీడు వాడే; పదమూడు పధ్నాలుగేళ్ల కంటే ఎక్కువ ఉండవు. నాకంటే కొంచెం బలిసి వున్నాడు. చొక్కా, నిక్కరు మాత్రం తొడుక్కుని ఉన్నాడు. నిద్రలోంచి లేచివచ్చాడు గావును; కళ్లు నులుము కుంటూ, ఒకచేత్తో తుపాకి ఈడ్చుకుంటూ మేడమెట్లు దిగి వచ్చాడు. వచ్చి వాళ్ల అమ్మను అడిగాడు:

"అమ్మా ! షెపర్డ్ సన్ వాళ్ళ వాళ్ళెవరూ రాలేదా ?"

"ఊహూ. రాలేదు."

"అరెరె. బలే ఛాన్సు పోయింది. నిజంగా వాళ్ళేవస్తే ఒకణ్ణయినా చంపకుండా వదిలే వాణ్ణి కాదు."

ఈమాటల కందరూ నవ్వారు. బక్ అన్న బాబ్ అన్నాడు: "నిజంగా వాళ్లేవస్తే మమ్మల్నీ పాటికి చంపేసి ఉండేవాళ్లు. నువ్వింత ఆలస్యం చేస్తే ఎల్లా ?"

"పోరా బాబ్! మీ రెవ్వరన్నా వచ్చి నన్ను కిందకి తీసుకు రాగూడదూ ? అసలిల్లాంటి దేదున్నా మీరు నన్నుమర్చి పోతారు. నాకొక్క సారన్నా ఛాన్సు ఇవ్వరు," అన్నాడు బక్.

బక్ వాళ్ల నాన్న నవ్వి అన్నాడు: "బక్! మించిపోయింది లేదులే. నువ్వు పెద్దయ్యాక షెపర్డ్ సన్ వాళ్లతో పోట్లాడటానికి కావలసినంత ఛాన్సు ఉంటుంది. ఇప్పుడు నువ్వుపోయి మీ అమ్మ చెప్పినట్టు చెయ్యి."

బక్ నన్ను చెయ్యి పట్టుకుని మేడమీదికి తీసుకు పోయాడు. నాకొక పంట్లాం, పొడుగు చేతుల చొక్కా, ఒక కోటు ఇచ్చాడు. తొడుక్కున్నాను. బక్ నా పేరేమిటని అడిగాడు. నేను చెప్పబోయే లోగా తనసొద చెప్పసాగాడు. అవ్వాళ మధ్యాహ్నం అడవిలో ఒక చిలకను, ఒక కుందేలును పట్టుకున్నాడట. వాటిని తరవాత చూపిస్తా నన్నాడు. తరవాత ఒక ప్రశ్న అడిగాడు—కొవ్వొత్తి ఆరిపోయి నప్పుడు మోజెస్ ఎక్కడున్నాడని. "నాకు తెలియదు, ఆకథ ఎప్పుడూ వినలే" దన్నాను.

"ఆలోచించు," అన్నాడు బక్.

"నాకు తెలియందే ఎల్లా ఆలోచించను ?"

"ఊహించాలి. చాలా తేలిక. ఊ." కాసేపు ఆలోచించాను.

"ఏ కొవ్వొత్తి ?" అని ఎదురు ప్రశ్న వేశాను.

"ఏదైనా సరే. ఏదో ఒక కొవ్వొత్తి ఆరిపోయి నప్పుడు."

"ఊహు. నాకు తెలియటంలా. నువ్వే చెప్పు, ఎక్కడున్నాడో," అన్నాను.

"ఎక్కడుంటాడు! కొవ్వొత్తి ఆరిపోతే చీకట్లో ఉంటాడు. అంతే."

"సరే. నీకు తెలిసి నన్నెందు కడిగావు?"

"ఎహె. నీకేం అర్థం కాలేదు. ఇది పొడుపు కథ. అంతేకాని నాకు తెలియక అడిగా ననుకుంటున్నావా? సరేగాని, నువ్విక్కడ ఎన్నాళ్లుంటావు? అచ్చంగా ఇక్కడే ఉండి పోరాదూ? బలే సరదాగా గడపొచ్చు. ఇప్పుడు మాకు స్కూలుకూడా లేదు. రోజల్లా ఆడుకోవచ్చు. నీకు పెంపుడు కుక్క ఉందా? నాకున్నది. బలే మంచికుక్క. నదిలో ఏదన్నా పడేసి తెమ్మంటే తెస్తుంది. ఆదివారంనాడు నువ్వు తల దువ్వించు కుంటావా? నాకు తల దువ్వించు కోటం తలనెప్పి. కాని మా అమ్మ దువ్వించుకునే దాకా చంపుతుంది. నువ్వు బట్టలు కట్టుకోటం అయిందా? సరే, ఇకరా. కిందకి పోదాం"

కిందకి వెళ్లేటప్పటికి నాకు భోజనం సిద్ధం చేశారు. భోజనం చేస్తుండగా అంతా నన్ను ప్రశ్న లడిగారు. నేను నాకథంతా చెప్పాను. మాది ఆర్కన్సాస్ రాష్ట్రమని, అక్కడ మావాళ్లు వ్యవసాయం చేసుకుంటూ వుండేవాళ్లనీ, మాఅక్క మేరీ ఎక్కడికో లేచిపోయి ఎవరినో పెళ్లి చేసుకుందనీ, మేరీని వెదకటానికి వెళ్లిన మాఅన్న మళ్ళీ తిరిగి రాలేదనీ, మాఅమ్మ, ఇద్దరు తమ్ముళ్లు చచ్చిపోయారనీ, మా నాన్నకూడా కొంతకాలానికి చచ్చి పోయాడనీ, మా పొలం కౌలు పొలం కావటంవల్ల భూస్వామి లాగేసు కున్నాడనీ, నేనొక్కణ్ణే ఒంటరి గాణ్ణయిపోయి బదుకు తెరువుకోసం దేశంమీదికి బయల్దేరాననీ చెప్పాను. నాకథవిని వాళ్లు ఎంతో జాలిపడ్డారు: నన్ను ఇష్టమై నంత కాలం వాళ్లింట్లో ఉండవచ్చని చెప్పారు.

అప్పటికి తెల్లవార వచ్చింది. అంతా నిద్ర పోయారు. నేనుకూడా బక్ గదిలో పడుకుని నిద్ర పోయాను. కాని దాని దుంపతెగా, నిద్ర లేచేటప్పటికి వెధవది, నాపేరేమిటో మర్చిపోయాను. ఒక గంటసేపు జ్ఞాపకం తెచ్చుకుందామని తన్నుకులాడాను. కాని జ్ఞాపకం రాలేదు. అంతలో బక్ వచ్చాడు.

"బక్! నీకు స్పెల్లింగ్ బాగా వచ్చా?"

"ఓ."

"కాని నాపేరు స్పెల్లింగ్ నీకు చేతకాదు. పందెం."

"చూస్కో చెప్పేస్తాను," అని ఒకొక్క అక్షరమే నాపేరు చెప్పాడు. జార్జ్ జాక్సన్! ఆ, అదీనాపేరు. దాన్ని పదిమాట్లు వల్లె వేసుకున్నాను.

నాకు ఆశ్రయ మిచ్చిన ఆ కుటుంబం బలే విచిత్రమైనది. వాళ్ల ఇల్లుకూడా నేనిదివరలో చూసిన ఇళ్లకంటె చాలా బావుంది. అంతా కొత్త ఫేషన్. కిటికీలు, తలుపులు, భోజనశాల, వంటగది, పడకగది, హాలు, మేడమీద గదులు, ఇంటిచుట్టూ ఆవరణ అన్నీ అందంగా శుభ్రంగా వున్నాయి. ప్రతి గదిలోను చక్కని చిత్రపటాలు గోడలకి కట్టి ఉన్నాయి. ఖరీదైన బల్లలు, వాటిమీద చక్కని కొయ్యబొమ్మలు, పువ్వుల కుండ్లు, అలమారల నిండా ఏమిటేమిటో బైండు పుస్తకాలు, ముఖ్యంగా కవిత్వం పుస్తకాలు ఉన్నాయి.

ఆఇంటివాళ్ల యింటిపేరు గ్రేంజర్ ఫర్డు. వాళ్ళ పెద్దమ్మాయి చాల ఏళ్లకిందట, పదిహేనేళ్ల చిన్నవయస్సులోనే చచ్చిపోయిందిట. ఆ అమ్మాయి వేసిన బోలెడు చక్కని బొమ్మల పటాలు గోడలకి తగిలించబడి ఉన్నాయి. అంత చిత్రమైన బొమ్మలు నే నెప్పుడూ చూడలేదు. ఆబొమ్మలు ఏదో విచారాన్ని సూచించే నల్లటి రంగుతో గీయబడివున్నాయి. ఒక బొమ్మలో నల్లటి బట్టలు కట్టుకున్న ఒక అందమైన అమ్మాయి వుంది. ఆమె ఒక గోరీమీద పడి ఏడుస్తూ ఉంటుంది. బొమ్మకి అడుగున "నిన్నిక చూడలేనా, అయ్యో" అని రాసివుంది. ఇంకో బొమ్మలో అలాంటి అమ్మాయే ముఖం జేబురుమాలలో దాచుకుని ఏడుస్తూ వుంటుంది. ఒకచేతిలో చచ్చిపోయిన పక్షి ఉంటుంది. బొమ్మ అడుగున "నీపాట ఇక వినలేనా, అయ్యో'' అని వుంది. ఇంకో బొమ్మలో ఆ అమ్మాయి కిటికీలోంచి చంద్రుడి కేసి చూస్తూ కన్నీళ్లు కారుస్తూ ఉంటుంది. ఒక చేతిలో ఒక ఉత్తరం ఉంటుంది. బొమ్మ అడుగున "తరలి పోయితివా, మరలి రాబోవా, అయ్యో" అని రాసివుంది. ఈబొమ్మలు నిజానికి బాగానే ఉన్నాయి. కాని నాకెందుకనో అట్టే నచ్చలేదు. వాటిని చూస్తుంటే దిగులు పుడుతుంది. పాపం గ్రేంజర్ ఫర్డ్ కుటుంబీకులు తమ పెద్దమ్మాయి చనిపోయి నందుకు రోజూ

తిలుచుకుని కుమిలిపోతూ ఉంటారు. ఇంకా చాలా బొమ్మలు వేయాలని ఆమె అనుకున్నదిట. కొన్ని కొన్ని సగం సగంవేసి వదిలి పెట్టింది. అవి పూర్తి చేస్తే ఆమె ఎంత గొప్పదయ్యేదో అని వాళ్లు అనుకుంటూ ఉంటారు.

ఆమె బొమ్మలే కాకుండా కవిత్వంకూడా రాసే పేపర్లలో చావు వార్తలు చదివినప్పుడల్లా వాటి మీద పద్యాలు అల్లేదట. ఒకసారి ఒక కుర్రవాడు బావిలోపడి చచ్చిపోయాడట. దానిమీద ఈ అమ్మాయి పద్యాలు రాసింది.

"పాపమొక బాలు డొకనాడు బావిలోన
కాలవశమున పడిపేరు కాలుజారి
ముక్కు పచ్చలారని బాలుడక్కటకట!
ఘోరమృత్యువు కెరయయ్యె దారుణముగ."

ఇదే ధోరణిలో పుస్తకం నిండా చాలా పద్యాలు రాసింది. పుస్తకంలో ఎక్కడ చూసినా "అక్కటకటా, అయ్యయ్యో"లు తప్ప మరేమీ లేవు. బహుశా ఆమెకు మనలోకంలోకంటే శ్మశానంలోనే హాయిగా వుండేమో, ఎవరు చెప్పగలరు? కాని పద్యాలు మాత్రం కమ్మగా ఉన్నాయి. పదిహేనేళ్లు నిండకుండా అలాంటి పద్యాలు రాసిందంటే పెద్దదయితే ఇంకా ఎలా రాసేదో! బక్ చెప్పాడు: "మా అక్కయ్య మాట్లాడటంకూడా పద్యాల్లాగానే మాట్లాడేది. పద్యం రాయట మంటే ఆమెకి మంచినీళ్లు తాగినంత తేలిక." ఆమె ఏవిషయం మీదనైనా సరే పద్యంర్రాసేసేదిట. అందులో దుఃఖ విషయాలైతే మరీ ఉత్సాహంతో రాసేదిట. ఇరుగు పొరుగు వాళ్లిళ్లలో ఎవరన్నా చనిపోతే రెండు నిమిషాల్లో పద్యాలు రాసి అక్కడికి తయారయ్యేదిట. ఆ పద్యాలకి "బాష్పాంజలి" "దుఃఖాశ్రువులు" ఇలాంటి పేర్లు పెట్టేది. ఆమె బతికుండగా చనిపోయిన వాళ్లందరిమీదా పద్యాలు రాసేది. పాపం ఆమే చనిపోయింది. ఆమెమీద పద్యాలురాసే వాళ్లెవరూ లేకపోయారు. అందుచేత నేనే రాద్దామని కొన్నిసార్లు ప్రయత్నించాను. కాని పద్యాలు సగందాకా వచ్చి తరవాత కుదరక ఆగిపోయేవి. ఆ ప్రయత్నం అంతటితో మానేశాను.

(ఇంకావుంది)




అడవి మధ్యకి వెళ్ళింది ఆలిస్. కోరుకున్నప్పుడల్లా చిన్నదై పోడానికీ, పెద్దదైపోడానికీ కిటుకు తెలిస్తే బాగుండుననుకుంది. పుట్టగొడుగుమీద కూచుని రెక్కలెప్పుడొస్తాయా అని తపస్సు చేస్తున్న ఒక పట్టుపురుగుని సలహా అడిగింది. పట్టుపురుగు గడ్డిలో పారిపోతూ పోతూ 'అటో ముక్క ఇటో ముక్క తీసుకో' అంది. పుట్టగొడుగంతే ఉన్న ఆలిస్ చేతులు చాపి రెండుముక్కలూ అందుకుంది. ఒకటి కొరికి చూసింది ఎనిమిదడుగులెత్తు పెరిగిపోయింది. మరోటి కొరికింది వేలెడంతయింది. ఇంక వీలు చూసుకుని తన అసలు ఎత్తుకు పెరిగింది. నవ్వులో ప్రత్యక్షమై నవ్వుతోనే మాయమయ్యే చెషైర్ పిల్లి సలహా తీసుకుని ఒక ఇంటికి వెళ్ళింది. అక్కడ టోపీలు చేసే పిచ్చివాడొకడూ, పిచ్చి కుందేలొకటీ, మధ్యలో పిచ్చెత్తిన ఎలకని కూచోపెట్టుకొని విందు చేసుకుంటున్నారు. కుందేలూ, పిచ్చివాడూ చెయ్యీ చెయ్యీ పట్టుకొని నాట్యం చేస్తున్నారు. మధ్యమధ్య కూచుని రొట్టెలాగా కప్పుల్ని కోస్తున్నారు. టీ పోసి పొయ్యడమే కాని తాగడం కనపడదు. ఆలిస్ ఆకలేస్తోందని చెప్పినా ఇచ్చినట్టే ఇచ్చి లాక్కుంటారు. వాళ్ళ గడియారంలో ఎప్పుడూ 6 గంటలే. గడియారాన్ని వేణ్ణీళ్ళల్లో ఉడకపెడతారు. ఈ వెర్రివిందు భరించలేక ఆలిస్ మళ్ళీ అడవిలోకి పారిపోయింది.



కుందేలూ పిచ్చివాడూ చెయ్యీ చెయ్యీ పట్టుకుని నాట్యం చేస్తున్నారు.



మధ్య మధ్య కూచుని రొట్టెలాగా కప్పుల్ని కోస్తున్నారు.

గడియారాన్ని వేణ్నీళ్లలో ఉడకపెడుతున్నారు.

# ★ బాలగంధర్వులు ★

చిన్నన్నయ్యా నీకు యింతవరకు వ్రాసిన జాబులనుబట్టి నీకు కొంతమటుకు గొప్పవారు అంటే ఎవరో బోధపడి వుంటుందనుకొంటాను. ఇంతవరకు చిన్నన్నయ్య ఎవరిని గురించి వ్రాశాడో వారంతా పెద్దవాళ్లయ్యాకనే గొప్పవాళ్లు అయ్యారు. "నేనుకూడా పెద్దదాన్ని అయ్యాక గొప్పదాన్ని అవుతానని" నీకు అనిపిస్తూవుండవచ్చు. మేమందరం మాచిన్నతనంలో యిలాగేఅనుకునేవాళ్లమే! కానీ – చిన్నవయస్సులోనే గొప్పవాళ్లుఅయిన వారెందరోవున్నారు, నీకు సంగీతంఅంటే ప్రాణంకాబట్టి. సంగీతవిద్యలో చిన్నవయస్సులోనే ఖ్యాతినార్జించిన కొందరి జీవిత విశేషాలను యీ లేఖలో వ్రాయదలిచాను. దేవతలలో సంగీతం పాడేవారిని గంధర్వులంటారు; దేవతలంత బాగా పాడగల బాలులను మనం బాలగంధర్వులందాం.

1685 వ సంవత్సరంలో జర్మనీలో ఒక మంగలియింట హేన్‌డల్ అనే పిల్లవాడు పుట్టాడు. తండ్రికిమాత్రం కొడుకును ఒక ప్లీడరు చేయాలని వుద్దేశ్యంవుండేది. కానీ హేన్‌డల్‌కు పాటలంటే ప్రాణం. అతనికి పాటలపై గల మక్కువ నానాటికి ఎక్కువై, ఎక్కడిదో ఒక పాత పియానో సంపాదించి దానిని గొడ్లచావడిలో అటకమీద భద్రం చేశాడు. అందరూ నిద్రపోయాక తను నంపాదిగా అటకఎక్కి అక్కడ తన యిష్టంవచ్చినంతసేపు యిష్టమైనన్ని పాటలువాయించటం ప్రారంభించాడు. చివరకు యీ విషయం పెద్దవాళ్లవరకూ పోయింది. వాళ్ళ నాన్నకూడా పిల్లవాడి మనస్సును గుర్తించి అతడికి వెంటనే సంగీతంలో శిక్షణ యిచ్చే ఏర్పాట్లు చేశాడు. 4, 5 సంవత్సరాలలోనే హేన్‌డల్ ఎన్నో సంగీతనాటకాలు వ్రాశాడు.

బైబిల్‌పాటలన్నిటికీ బాణీలు కట్టాడు. ఈనాటికి ప్రపంచంలోని క్రైస్తవులంతా క్రిస్టమస్‌రోజున మెసయాపాట అని ఒకపాట పాడుతారు. ఆ పాటవరున యీ హేన్‌డల్ కట్టిందే.

ఆ దేశాల సంగీతంలో క్రొత్త బాణీలు ఎలారచించాలో మార్గం చూపినవాడు హేడన్. ఆయనకూడా చిన్ననాటినుంచీ తన ప్రతిభను చాటాడు. ఇతడు ఆస్ట్రియా దేశంలో పేదరైతులయింట 1732 లో పుట్టాడు. లేని సంసారంలో పుట్టినందువల్ల యితడు చాలా చిన్నతనంనుంచీ డబ్బు సంపాదించటానికి కష్టపడక తప్పలేదు. అంత హీనపరిస్థితులలో వున్నప్పటికీ హేడన్‌తండ్రి యీతనికి సంగీతంలోగల అభిరుచిని గమనించి, తక్షణమే అతనిని మంచి విద్వాంసులవద్ద చేర్పించి సంగీతం చెప్పించాడు. ఎంతో కష్టపడి శ్రావ్యంగా పాడటం నేర్చుకొన్నాడు కానీ, కొద్ది సంవత్సరాల తరువాత దురదృష్టవశాన అతని కంఠం పాడైపోయింది. తదనంతరం

కష్టపడి అన్నిరకాల సంగీత వాయిద్యాలనూ వాయించటం నేర్చుకొన్నాడు. ఈతడు 150 దాకా కృతులు వ్రాశాడు చర్చి ప్రార్థనలలో 'ఆస్ట్రియా' అనిపేరుట వుండే ఒక కృతి యీయన రచనయే.

మరొక ప్రఖ్యాతగాయకుడు ఫ్రాంజ్ షూబర్ట్ అనే ఆయనకూడా తన 11 వ ఏటనే స్వరాలుకట్టటంలో ప్రతిభ సంపాదించాడు. ఇంత ప్రతిభకలిగిన గాయకుడైనప్పటికీ యితడు పొట్టకూటికోసం అలమటించవలసివచ్చింది.

కర్ణాటక సంగీతంలో మనం త్యాగరాజ స్వామినిగూర్చి ఎంత భక్తి భావంతో చెప్పుకొంటామో పాశ్చాత్య దేశాలలో బిథోవెన్ అనే ఆయన పేరును యీనాటికీ వారు అంత భక్తి భావంతో చెప్పుకొంటారు. దురదృష్టవశాన యీయన కొంతకాలానికి చెవిటివాడయ్యాడట. చిత్రకారుడికి చూపుపోతే ఎంత కష్టమో, సంగీతవిద్వాంసునికి శ్రవణేంద్రియం పోతేకూడా అంత కష్టమేకదా! తనకు శాపంలా ప్రాప్తించిన యీ బధిరత్వానికి ఆయన ఎంతో చికాకుపడిపోయి అదివరకు అంత శాంతంగావుండే మనిషికూడా ఎలుగ్గొడ్డుమాదిరిగా మాట మాట్లాడితే బుస్సుమనేవాడట. బిథోవెన్ రచించిన కృతులను 11 వండ్ల బాలుడొకడు యిటీవల పెద్ద విద్వాంసులువున్న సభలో ఫిడేలుపై వాయించాడు పాట పూర్తి అయ్యీ అవటంతోటే ఒక జీబుతల మనిషి గబగబా వేదికపైకి



ఎక్కి ఆకుర్రవాణ్ణి చంకకు ఎత్తుకొని, ముద్దుపెట్టుకొని "నాయనా! నీ యీ అమరగానం వినిపించి స్వర్గంలో దేవుడువున్నాడనే సత్యాన్ని మరొకసారి ఋజువు చేశావుకదా!" అన్నాడట. జీబుతలమనిషి అంటే ఎవరో పిచ్చివాడు అనుకొంటావేమో, ఆయన ఆల్బర్ట్ ఐన్‌స్టీన్. అంటే గణితశాస్త్రంలో మహామేధావిగా ప్రపంచం పరిగణిస్తున్న మహనీయుడు.ఆయన మన్ననను పొందిన బాలుడు ఎవరో తెలుసా — అతని పేరు యెహూదీ మెనూహిన్. మెనూహిన్ యీనాడు ప్రపంచంలోకల్లా గొప్ప ఫిడేలువాద్యగాండ్రలో ఒకడుగా ప్రఖ్యాతి పొందాడు. ఈయన వయస్సు యిప్పుడు 36. ఈయన 1916 లో న్యూయార్కు నగరంలో సామాన్య కుటుంబీకులకు పుట్టాడు. 3 ఏండ్ల బాలుడుగా వున్నప్పుడు ఈతనితండ్రి బొమ్మఫిడేలు యీయబోతే అసలు ఫిడేలేకావాలని పంతం పట్టిసాధించాడు 8 ఏండ్లబాలుడుగా వున్నప్పుడే పారిస్ మహానగరంలో యీతడు మొట్టమొదటి కచ్చేరీ చేశాడు. న్యూయార్కు నగరంలో నే యీతడు తన 10 వ ఏట పెద్ద కచ్చేరీ చేస్తుంటే యిదంతా వెర్రితనం క్రింద జమకట్టదలచివచ్చిన విమర్శకాగ్రేసరులు కచ్చేరీ ముగిసేసరికి తామే మంత్రముగ్ధులై యీ బాలగంధర్వుని పొగిడేందుకు

(39-వ పేజీ చూడండి)

# ★ చేపల సంసారం ★

చేపలకు తమ పిల్లలపై సామాన్యంగా ఎటువంటి అనురాగమూ వున్నట్టు తోచదు. కొన్ని కొన్ని రకాల చేపలు మాత్రం తమ సంతును గూర్చి ఎంతో శ్రద్ధ తీసుకొంటాయి. అమెరికా, ఆఫ్రికా దేశాలలో కనుపించే కొన్ని తరహాల చేపలు మాత్రం ఆడచేపలు తాము పెట్టిన గ్రుడ్లను, అవి పొదిగి పిల్లలు అయ్యే పర్యంతం అలా నోట కరుచుకొనే తిరుగుతుంటాయి. ఈ గ్రుడ్లు పిల్లలుగా మారిన తరువాతకూడా, అపాయం ఏదైనా రాబోతున్నదని తోచగానే పిల్ల చేపలు తల్లిచేప నోట్లోకి గబుక్కున దూరిపోతాయి. తల్లి యిలాగు బిడ్డలను అహర్నిశలు తన నోటిలోనే దాచి సంరక్షిస్తుంటే యీ బిడ్డలకు తండ్రి అయిన మొగచేప తల్లీ పిల్లలు పోయిన పొడుగునా వాటి చుట్టూ తిరుగుతూ దగుల్బాజీలు ఎవరు దగ్గరకు రాకుండ కనురెప్ప వేయక కాపలా కాస్తూ వుంటుంది




మనదేశపు రకాల చేపలలో అరియస్ అనే రకంవాటిలో ఆడచేప గ్రుడ్లను అలాపెట్టి తనదారిని తాను పోతే మొగచేపే వాటి నన్నిటినీ నోట కరుచుకు తిరుగుతుంది. ఆ గ్రుడ్లన్నీ పొదిగి పెద్దవయ్యేవరకు పాపం—యీ మొగ చేపకు తను యింత తిండి తినటానికైనా ఆస్కారం వుండదు. అలా తిండిలేక తను మాడటానికైనా యీ మొగచేప సంతోష పూర్వకంగా సమ్మతిస్తుంది కానీ, అరనిముషమైనా ఆ పసిగుడ్లను క్రిందికి ససేమీ దించదే! (ఇదంతా వింటుంటే యీ మొగచేపలన్నీ బాబరు చక్రవర్తులేనా అనిపిస్తుంది. వెనుకటికి బాబరు చక్రవర్తి కుమారుడు హుమాయూన్‌కు ప్రాణం మీదికి వచ్చిందట. కొడుకును బ్రదికించి, కావాలంటే తనను తీసుకొని పొమ్మని బాబరు దేవుని ప్రార్థించాడట. ఈతని ప్రార్థన ఫలితమో ఏమో — కొద్ది రోజులలో హుమాయూన్ క్రమేపి కోలుకోవటమూ, బాబరు క్రమేపి కృశించటం, చిట్టచివరకు హుమాయూన్ బ్రతికి, బాబరే ప్రాణం విడవటమూ సంభవించిందని చెప్పుకొంటారు) నిజంగా యీ మొగచేపలకు వున్నంత పుత్రవాత్సల్యంలో సగం మానవులందరికీ వుంటే పిల్లల జీవితం ఆనందమయ మౌతుంది కదూ!

బ్రెజిల్ దేశంలో దేవతామత్స్యాలని ఒకరకం చేపలు వున్నాయి. ఆడచేపలు తాము పెట్టే గుడ్లను ఏ ఆకుల పై భాగానికో, రాతిపైభాగానికో అంటించి పెడతాయి. మొగచేప యిక వాటిదగ్గిరనే అస్తమానంవుండి తన

పెద్దపొలుసులతో అలా విసరుతూనే వుంటుంది. ఎగిరేచేపలంటూ కొన్ని రకాలు వున్నాయి. వీటి పొలుసులు చాలా పెద్దవిగావున్న కారణంచేత వాటి సహాయంతో యీ చేపలు కొద్ది కొద్ది దూరాలు ఎగిరిపోగలవు. వీటిలో ఆడచేప తానే ముందుగా ఒక గూడు కట్టి అందులోనే కుదురుగా గ్రుడ్లన్నీ పెట్టి వేస్తుంది. గూడు అలా నీళ్ళలో ఎప్పుడూ తేలుతునేవుంటుంది. బోబీస్ అనే రకం చేపలలో మొగ చేపలు కొన్ని చేరి ఒక్క ఆడచేప కోసం,మన పురాణాల్లో రాక్షసులు పోట్లాడు కొన్నంత భయంకరంగా పెనుగులాడి, ఆడ చేపను 'జయిస్తాయి'! ఆ ఆడచేప గర్భవతి అయి ప్రసవసమయం ఆసన్నమౌతున్నదనగానే దానిభర్త తానే ఒక గూడు కట్టివేసి, అందులో ఆడచేప చేత గుడ్లు జాగ్రత్తగా పెట్టిస్తుంది. మరొక రకమైన చేపలలో ఆడచేప కొన్ని నీటిబుడగలను రప్పించి వాటి నన్నింటినీ ఒక రకమైన




ఏంగ్లర్ చేప

జిగురుపదార్థంతో అంటకలిపి వుంచుతుంది. ఈ బుడగల గూడు పైకి చేరి, ఆడ చేప వెన్నుపైకి వచ్చేలా పడుకొని తాను పెట్టే గ్రుడ్లు ఆ గూటిలోనే పడేటట్లు జాగ్రత్తపడుతుంది. మొగచేప యిక ఆగ్రుడ్లను తన ప్రాణంకంటే ఎక్కువగా కాపాడుతుంది.

సముద్రపు గుర్రం (ఫిబ్రవరి 20 వ తారీఖు ఆంధ్ర వారపత్రికలో సముద్రపు గుర్రాన్ని గూర్చిన భోగట్టా ప్రకటించాం.) గొట్టంచేప అనే రకాలలో మొగవాటికి— కంగారూ మృగానికి వున్నట్లుగా— పొట్టలపైన కొన్ని సంచులు వుంటాయి. ఆడ చేపలు సరిగ్గా యీ సంచుల్లోకి వచ్చి పడేటట్లుగానే గ్రుడ్లు పెట్టుతాయి. ఆడచేప పొట్టలో నుంచి పైకివచ్చిన గ్రుడ్లను అవి పొదిగి పిల్లలు అయ్యేపర్యంతం మొగచేపలు తమ పొట్ట సంచీలలో మోస్తాయి. (ఇలాటి ఏర్పాటు మానవులల్లో కూడా వుంటే ఎంత బాగుంటుందని కొందరు స్త్రీలకు అనిపిస్తే అనిపించవచ్చు.) గ్రుడ్లన్నీ పిల్లలుగా మారాక కూడా వాటికి ఎప్పుడు భయంవేసినా తల్లి చెరుగులోకి దూరకుండా తండ్రి తిత్తి కోసమే వెదుక్కుంటూ పోతాయి.

మరొకరకమైన చేప, బిడ్డను తల్లి ఎత్తుకున్నరీతిఆప్యాయంగా మొగుణ్ణి



చేప వేటగాడు

పొట్టకు తగిలించుకుని ఎక్కడికి పడితే అక్కడకు పోతుంది. ఈ రకం చేపను యింగ్లీషులో ఏంగ్లర్ అంటారు. ఆ మొగ చేపైనా చంటి చేపఅంతే వుంటుంది. ఆడచేప మాత్రం మొగడితో పోల్చిచూస్తే పెద్ద హిడింబిలా వుంటుంది. సర్వాధికారిణిలా జులుంచేసే యీ ఆడ చేపకు ఎక్కడా ఆహారం దొరక్కపోతే పొట్టనే అంటి పెట్టుకొనివున్న ఆ అమాయికపు మొగుణ్ణే మింగి వేస్తుందో ఏమో కూడాను! అసలు ఆచేపఆకారం చూచారా-ఎంత భయంకరంగా వున్నదో !

ఇదే కుటుంబానికి చెందిన కొన్ని చేపలు మరికొన్ని చిన్న రకాల చేపల పాలిట తామే జాలర్లుగా తయారు అవుతాయి వీటినెత్తిమీద చేపలు పట్టేందుకు మనం వుపయోగించే గాలంలాంటిది ఒకటి వుంటుంది. దాని చివరను ఒక చిన్న మాంసపు ముక్క కూడాను! ఈసరంజామాతో యీ చేప నీళ్లలో కదిలిపోతూ చిన్న చిన్న చేపలు వుండేచోట చేరి తాను అల్లంత దూరానే నిలచి బారెడు పొడుగున వుండే యీ 'గాలాన్ని' చిన్నచేపల ముందుకు పడేట్టుగా విసరుతుంది. పాపం— ఆచిన్న చేపలు మాంసంముక్క కోసం ఒకదానిని ఒకటి వెనక్కునెట్టుకొంటూ గబగబా వచ్చి పట్టుకొంటాయి. ఇక అంతే - గాలం' గాలం చివరను మాంసం ముక్క' ఆముక్కకోసం ఆశపడ్డ చిన్న ప్రాణం అన్నిటినీ ఆ పెద్దచేప తన దగ్గరకు లాగేసుకొని చిన్న చేపను చప్పరించివేసి మళ్ళా గాలాన్ని వదిలేసి వయ్యారంగా ఆడిస్తుంది.

చిన్న చేపలను పట్టటం తెలిసిన చేపలు వున్నట్టే, గురిచూచి పురుగులను వేటాడటం వుగ్గుతో నేర్చుకొన్న మరికొన్ని గడుసురకాల చేపలు కూడా వున్నాయి. ఇవి ఇండొనిషియా ప్రాంతపు సముద్రంలో వుంటాయి. నీటిలోవుండే నాచు, మొక్కలపై వాలే పురుగులు వీటి ఆహారం. పురుగులు వాలినపోటికల్లా పరిగెత్తి అవి పట్టు పడకపోతే ఏడ్చేదాని కంటే తాను అల్లంత దూరంలో వుండే ఆ పురుగును గురిచూచి కొట్టి చంపి దాని ప్రేతం అక్కడ పడిం తరువాతనే ఆరగించేందుకు యీ చేప మంచి తెలివైన పద్ధతి కని పెట్టింది. ఏ ఆకుమీదైనా ఏదో చిన్న పురుగు వాలటం యీచేప కంట పడగానే బాగా నోటినిండా నీళ్లు దట్టించి వాటిని పెదిమల సందున చిన్న రంధ్రంలోనుంచీ విసురుగా వదలి సరిగ్గా ఆపురుగు మీద పడేటట్లే గురిచూసి జిమ్ముతుంది. ఆపురుగు చస్తుంది. ఈ చేప మింగుతుంది. శ్రీరాముని బాణానికైనా గురితప్పటం అంటూ వుంటుందేమో కానీ యీచేప వదిలే నీటి బాణానికి ఎరఅక్కడ పడవలసిందే!

ఎలక్ట్రిక్ చేప అని మరొక రకమైన అతిగడుసు చేప ఒకటి వున్నది. దారినిపోయే చిన్న చేపలను యితర జలచరాలను యీ చేప యిట్టే తాకుతుంది. అంతటితో అవతల ప్రాణికి ఎలక్ట్రిక్ షాక్ కొట్టి, యిక దాని కరచరణాలు బంధైపోతాయి. వాటికి ఆషాకు తగలట మేమిటో, ఆప్రాణి యీ చేపపొట్టలోకి పోవట మేమిటో - యిట్టే జరిగిపోతాయి. ఈచేపలు పుట్టించే విద్యుచ్ఛక్తితో ఒకచిన్న దీపాన్ని వెలిగించవచ్చు. పెద్దచేప అయితే దాని తాలూకు విద్యుచ్ఛక్తితో ఏకంగా ఒక మోటారుకారునే నడిపించవచ్చు.

కొద్దికాలంలో అచ్చంగా యీ చేపలనే మన మోటార్లలో బాటరీలుగా వుపయోగించే రోజులు కూడా రాబోతున్నాయేమో ఎవరు చెప్పగలరు. !— వి.ఎస్.



ఎలక్ట్రిక్ చేప

# బాలగంధర్వులు

(35–వ పేజీ తరువాయి)

మాటలు దొరకక తబ్బిబ్బుఅయినారు. మెనూహిన్ 18 ఏండ్ల బాలుడయ్యేసరికి మొత్తం 18 దేశాలలో 110 కచ్చేరీలు చేశాడు. ఈయన కిందటి నెలలో మనదేశం వచ్చి బొంబాయి, మద్రాసు, కలకత్తా, ఢిల్లీ నగరాలలో కచ్చేరీలు చేశాడు. ఈ కచ్చేరీలను ఆల్ యిండియా రేడియోవారు 'రిలే' చేశారుకూడా.

మన తెలుగువాళ్లలోనే యీ మాదిరిగా చిన్నతనంలో గొప్ప పేరు సంపాదించిన గాయకుడు ఒకరు వున్నారు. ఆయన బాల మురళీకృష్ణ. ఈయన పెద్దవాడయ్యాక చేస్తున్న కచ్చేరీలకంటే 7, 8 ఏళ్ల బాలుడుగా వున్నప్పుడు చేసినకచ్చేరీలకు ప్రజలు తండోపతండాలుగా పోతూవుండేవారు. అంతచిన్న పిల్లవాడు మీసాలుతిరిగిన మార్దంగికుల మధ్యను కూర్చొని తలతిప్పుతూ కృతులు పాడుతూ సంగతులు పలుకుతూ వుంటే, శ్రోతలు ఉర్రూతలూగిపోతూవుండేవారు. ఆ దృశ్యం చాలా విచిత్రంగా తోస్తుండేది.

ఇంతకు ఇదంతా నేను ఎందుకు వ్రాస్తున్నానంటే, మనపెద్దవాళ్లు తమకునచ్చినట్లుగా పిల్లలు పెరగాలనీ, తయారుకావాలనీ చూస్తారే కానీ, పిల్లలు తమకునచ్చిన రీతిలోనే పెరుగుతూంటే అందుకు కావలసిన ప్రోత్సాహం యీయటం తమ విధిఅని గుర్తించటంలేదని తెలియచేయటానికే. ఇటువంటి అభిప్రాయంవున్నది కనుకనే నువ్వు ఫిడేలు కొనిపెట్టమన్నప్పుడు నాన్నావాళ్లు అంత చిరాకుపడ్డా నేను చిన్నన్నయ్యా నీ విషయంలో పట్టుపట్టాం. నీకు సంగీతం మొదలు పెట్టినందుకు, అందులో నిర్విరామకృషిచేసి, నలుగురిచేతా ఔనని అనిపించుకొన్నప్పుడే నీ పట్టుదల, మా పట్టుదలలు కూడా అర్థసహితం అవుతాయి.

—వియన్.








రాగిణీవారి 'ధర్మదేవత'లో గిరిజ.

# సినిమా ప్రేక్షకులకు బొందితో కైలాసం

మొదట్లో 'మూగ సినిమా' గా వున్న చలనచిత్రాలు 'టాకీలు' కావటం, '[illegible]' కూడా వుండటమూ మనకు పరిచయమైన విషయమే. చలనచిత్రకళ అంతటితో ఆగలేదు. 'త్రిడైమన్షనల్ పిక్చర్స్', 'త్రిడైమన్షనల్ సౌండ్స్' కల చిత్రాలుకూడా అనతికాలంలో రాబోతున్నాయి.

'త్రిడైమన్షన్' అంటే ఏమిటో ముందుగా వివరించవలసి వున్నది. ఇప్పుడు మనం చూచే సినిమాలలోనూ, బొమ్మలలోనూ ప్రతి ఆకారానికీ యింత పొడుగు, యింత వెడల్పు వున్నట్లు మాత్రమే మనం అర్థం చేసుకోగలం. కాని ఆ వస్తువు ఎంత మందాన వున్నదీ, మనం చిత్రం చూస్తుండగా వూహించుకోవాలే. ఊహించుకోవలసిందేమో కాని కంటితో చూడలేం. ఇక రాబోయే చిత్రాలలో వస్తువులు ఎంత స్థూలంగా వున్నదీ కూడా తెలుసుకొనేందుకు అవకాశం ఏర్పడబోతున్నది. దీనివల్ల ప్రయోజనం ఏమిటంటే తెరమీద కనిపిస్తున్న ఒక్క బొమ్మలో ఏ వస్తువు ఎంత స్థూలంగా వున్నదీ మన కంటికే తెలుస్తుంది. అంతేకాక మనకండ్ల ఎదుట నడిచే రంగంలో మనంకూడా వున్నట్లే తోస్తుంది. బొమ్మలో ముందువైపువున్న మనుష్యులు హాలులో ఎక్కడ కూర్చున్నా



మన భుజాలు తాకుతూ వున్నట్టే వుంటుంది. చిత్రంలో ఓ గుర్రం మంచి వేగంతో గబుక్కున మన వైపుకు వస్తుందనుకొందాము. 'త్రిడైమన్షనల్' పద్ధతిని యీ సన్నివేశాన్ని సినిమాతీసి ప్రదర్శిస్తే, అది చూస్తున్న ప్రతి వ్యక్తికూడా, ఆ గుర్రం తనమీద ఎక్కడవచ్చి పడుతుందో అనే భయంకొద్దీ ప్రక్కకు తప్పుకోవటం తాను ఎరుగకుండా చేసేస్తాడు. అదే యిప్పటి టాకీలోఅయితే ఆ గుర్రం చస్తే మనమీదకు రాలేదని ప్రతివాడు నిండుగానే కూర్చొంటాడు. మరొక సన్నివేశం విషయం ముచ్చటిద్దాం. ఒక హంతకుడు మరొక మనిషి మీద ఎక్కికూర్చొని కత్తిని బలంగా క్రిందికి దించుకున్నాడనుకోండి. క్రిందికి దిగివస్తున్న కత్తిని మాత్రమే కెమేరామెన్ చూపిస్తున్నాడనుకోండి. అదే 'త్రిడైమన్షన్' పద్ధతిని తీసివుంటే యీ సన్నివేశాన్ని చూస్తున్న యిన్నివందలమంది ప్రేక్షకులు అనాయికంగా తమ గుండెలపై చేతులు పెట్టుకు తీరుతారు. (అసలు సినిమా అంటేనే మిథ్య అయినప్పుడు, యీ పద్ధ

అంజలీవారి 'పరదేశి'లో
అంజలీదేవి, వసంత.

జంపనవారి 'మేనరికం'లో రేలంగికి హేమలత చిలకలుచుట్టి అందిస్తోంది.

తిని తీసే చిత్రంలో మిథ్యాతత్వం పూర్తిగా ఏర్పడుతుందన్న మాట.)

ఒకపాట కచ్చేరీలో మనం కూర్చొన్నా మనుకోండి. సామాన్యంగా పాటగాడు వేదికమైన ముందుకు జరిగి కూర్చొంటాడు. ఆతనికి కొంచెం వెనుకగా ఫిడేలువాయించే వ్యక్తి, ఆయన వెనుక మార్దంగికుడు, అందరి కంటే వెనుకగా తంబుర శృతి వేసే వ్యక్తి కూర్చొంటారుకదా! వీరందరూ చేస్తున్న ధ్వనులు హాలులో అన్ని వైపులకు సామాన్యమైన సాంద్రతతో వినిపిస్తాయా? లేదు. కాని మరి సినిమాలో మాత్రం పాట వినిపించేటప్పుడు పాట పాడేవారి కంఠం, ప్రక్క వాయిద్యాల ధ్వని యించుమించు సమానస్థాయిలో హాలులో అందరికీ ఒక్కలాగే వినిపిస్తాయి. అంటే అది అసహజ పరిస్థితియే. 'త్రిడైమన్షనల్' పద్ధతిని శబ్దాన్ని రికార్డుచేసి సినిమాహాలులో ప్రదర్శిస్తే మనిషి కంఠం కొంచెం బిగ్గరగానూ, ఫిడేలు ధ్వని అంతకంటే తక్కువగానూ, అన్నిటికంటె తక్కువగా తంబురశృతి వినిపిస్తాయన్న మాట.

'త్రిడైమన్షనల్' పద్ధతిని దృశ్యాన్ని శబ్దాన్ని చిత్రించినట్లైతే—పైన చెప్పినట్లుగా— ప్రతి ప్రేక్షకుడూ చిత్రంలోని ప్రతిభాగంలోనూ తాను ఎంతో సన్నిహితంగా వున్నట్లే భావించుకోగలడు. అంటే మిథ్యలోనే వాస్తవికత హెచ్చినట్లు అవుతుంది.

కొన్ని ఏండ్ల క్రితం మనదేశంలో ఒక చిన్న విదేశీ చిత్రాన్ని ప్రదర్శించారు. ఆ సినిమా చూడవచ్చిన ప్రతివారికీ టిక్కెట్టుతో పాటు అట్టతో చేసిన కళ్ల జోడు ఒకటి వుచితంగా యిచ్చారు. ఆ కళ్ల జోడులో ఒకవైపు ఎర్రని పులిపిరి కాయితం రెండోవైపున ఆకుపచ్చ పులిపిరి కాయితం వున్నాయి. సినిమా మొదలైనప్పటినుంచీ యీ కళ్లజోడు పెట్టుకొని సినిమా చూడాలి. అలా చూస్తుంటే అవతల తెరమీద వుయ్యాల వూగుతున్న అమ్మాయి వున్నట్టుండి కాళ్లు బారగా జాపితే, అవి మన మొఖానికి వచ్చి కొట్టుకొంటాయేమో అనిపించింది. వేగంగా పోతూ పోతూ వున్న లారీ గభిక్కున పెద్ద చప్పుడుతో బ్రేకులు వేసి ఆగిపోయేసరికి మనం పోయి ఆ లారీకి ఎక్కడ కొట్టుకొంటామో అని వెనక్కు తగ్గుతాం. ఒక చిలిపి కుర్రవాడు వచ్చి బంతిని గురి చూచి వదిలితే అది మనముఖం మీద కొట్టుకొన్నంతగా మనం గాభరా పడిపోయి బంతికోసం మనవెనుక అంతా వెదుకుతాం. ఇలాటివే ఎన్నో చూపించారు ఆ చిత్రంలో. అలాటి భ్రమ మనకు ఎలా కల్పించ గలిగిందీ వివరిస్తూ సినిమా చివరను ఒక చిన్న వ్యాఖ్యానం కూడా చూపెట్టారు. మామూలు కెమేరాలకు ఒకటే భూత అద్దం. ఈ కెమేరాకు రెండు భూతద్దాలు. ఈ రెండు లెన్సులు తీసిన రెండు చిత్రాలు ఒకదానిమీద మరొకటిగా పాసిటివ్‌లో ప్రింట్ చేస్తారు. ఎర్ర కాగితం అడ్డువచ్చిన కంటికి ఆకు పచ్చ చిత్రమూ, ఆకుపచ్చ కాగితం అడ్డువచ్చిన కంటికి ఎర్రచిత్రం కనిపించి, ఒక కంటికి కనుపించే చిత్రం రెండోకంటికి కనిపించకుండా చేసినందువల్ల చిత్రాన్ని చూసేటప్పుడు యింత సన్నిహితత్వం ఏర్పడుతుంది. కానీ యీ పద్ధతివల్ల ఒక చిక్కు వచ్చింది. ఈ రంగు కళ్లజోళ్లు అయితే అసలు చిత్రంలో టెక్నికలర్ వుపయోగించి ప్రయోజనం వుండదు. అందుకని



యువావారి టింగ్‌రంగాలో సీతారామయ్య.

ప్రతులకు - మాతృసేవ కార్యాలయం 25-ఏ తంబుచెట్టి వీధి, మద్రాసు-1.

ధనుస్సు:— సినిమా మాసపత్రిక. సంపాదకుడు— మాగాపు రామన్. విడి ప్రతి 10 అణాలు, కార్యాలయం మద్రాసు 17.

అంబిలి అమ్మవన్ :—(మళయాళంలో 'చందమామ' పత్రిక) వెల 6 అణాలు. కంట్రోలింగ్ ఎడిటర్ - చక్రపాణి. కార్యాలయం - బి. ఎన్. కె. ప్రెస్, మద్రాసు 24.

చాందోబా :— (మరాఠీలో 'చందమామ' పత్రిక) వెల 6 అణాలు.

వ్యాసావళి :— (రెండవ భాగం) రచయిత - కోడాలి లక్ష్మీనారాయణ బి. ఏ, ప్రచురణ: ఇతిహాస పరిశోధక మాల, మోపఱ్ఱు. వెల - 1 రూ. ప్రతులకు- కోడాలి లక్ష్మీనారాయణగారు, మోపఱ్ఱు (రేపల్లె తాలూకా)

అంజలి :— పద్యకావ్యం. రచయిత-బలభద్రపాత్రుని వేంకటసుబ్బయ్య. ప్రతులకు - (1) బి. కృష్ణారావు, టీచరు గవర్నమెంటు హైస్కూలు, దామష్ఠపా, హైదరాబాదు (దక్కన్) (2) దాజేపల్లి కిష్టయ్య అండ్ సన్సు, (3) వెంకటేశ్వర బుక్ డిపో, చిత్రా టాకీసు లేన్, సికిం ద్రాబాదు. (దక్కన్)

ఆనందం :—(ప్రథమ సంచిక) కులాసాకథల పత్రిక. ప్రకాశకురాలు—శ్రీమతి రత్నం యలమర్తి, సంపాదకుడు—రామమోహనరావు యలమర్తి వెల అణాలు 4. వివరాలకు—ఆనందం, కంభంవారి సత్రంవీధి, రాజమండ్రి.

'నందన'లో మీ జీవితఫలితాలు :—రచన ప్రొఫెసరు వర్మ ఎస్. ఎస్. పి; ప్రచురణ పద్మిని పబ్లిషర్సు 1/27 హైరోడ్డు, మద్రాసు 14 వెల 0-5-0.

చంద్రజ్యోతి:—(తెలుగు-ఇంగ్లీషు వారపత్రిక) సంపాదకుడు ఎ. వి. రమణరావు. వెల 4 అణాలు. కార్యాలయం— రాజమండ్రి.

అంజలి :—(ఉగాది సంచిక) సంపాదకుడు ఎం ఇ. ఎస్. గోపాల్. వెల 8 అణాలు కార్యాలయం 103 అర్మినియన్ వీధి, మద్రాసు-1.

వెండితెర :—(ఉగాది సంచిక) సంపాదకులు వైద్యుల శ్రీనివాసరావు ! గోపరాజు రామారావు గార్లు. వెల 8 అణాలు. కార్యాలయం, గాంధీనగరం, విజయవాడ-2. ★

# ఆకాశానికి నిచ్చెన

(23-వ పేజీ తరువాయి)

చీర కొనిం తర్వాత బాధపడినా అది కొనుక్కోకుండా వుంటే యింకా అమితంగా వ్యసపడేది.

'కోపం వచ్చిందా మీకు?' పిచ్చిగా వే అడిగింది ప్రశ్నను.

'ఎందుకూ?' గోవిందరావు నవ్వాడు.

'సరేలే. కోపం ఎందుకు? ఎప్పుడూ కొంటామా ఏమిటి?' అన్నాడు మళ్లీ. కాంతమ్మ తృప్తిపడింది.

ఆ సాయంత్రం కాంతమ్మ ఆ చీరను తీసుకుని కాంతమ్మగారి యింటికి వెళ్లింది. 'కూర్చోండి' అన్నది ఆమె.

'కాంతమ్మ కూర్చుని' యిదిగోనండీ. పొద్దున్న మీరు చూపించిన తర్వాత నాకూ ఇది కొనుక్కోవాలని బుద్ధిపుట్టింది. ఆయన్నడిగితే తెచ్చిపెట్టారు' అని తన చీరను చూపించింది. కాంతమ్మగారు ఆ చీరె అందుకుని చూస్తున్నంతసేపూ ఆవిడ ముఖంవంక పరీక్షగా చూడసాగింది.

కాంతమ్మగారి ముఖంలో ఎటువంటి భావమూ వ్యక్తం కాలేదు. చివ్వరికి అనుకోని విధంగా ముఖం మార్చేసి పెదిమలు విరిచి 'ఎందుకమ్మా. డబ్బు దండుగ' అన్నది.

కాంతమ్మ తెల్లబోయింది. కాని వెంటనే ఆవిడపయి ఎంతయినా కోపంవచ్చింది. తను ఆవిడ కొన్నటువంటి చీరే కొన్నందువల్ల అసూయవల్ల అలా అంటున్నదనుకుని 'అలా అంటున్నారేం?'

'ఏముందమ్మా. డబ్బు దండుగ కాకపోతేనూ. అది మావారు కొనుక్కువచ్చిం తర్వాత నాకే విచారం కలిగింది అది యిచ్చేసి రమ్మని ఆ డబ్బు పెట్టి యింకేవు యినా చీరలు తెమ్మన్నాను. ఆయన అలానే యిరవయి రూపాయల చొప్పున యీ రెండూ కొనుక్కువచ్చారు' అని లోపలకుపోయి రెండు చీరెలు తెచ్చి చూపించింది కాంతమ్మగారు.

కాంతమ్మకు నోటంటమాట రాలేదు. ఆచీరె ఆవిడకి డబ్బు ఖర్చు అనిపించిందా! తన తాహత్తుకు అది ఎంత విలువయినది అయివుండాలి అప్రకారం. 'పోనీ యీ డబ్బు పెట్టి రెండు చీరెలు కొనుక్కోకూడదూ!' అన్న భర్తమాటలు చెవుల్లో మారుమోగాయి కాంతమ్మగారు ఆ మాట అన్న తరువాత ఆచీరె ఎంతో అమూల్యమయిన వస్తువుగా కనిపించింది కాంతమ్మకు

ఆవిడయితే ఆచీరె తిరిగి పంపించేసింది. తను తిరగ్గొడితే ఎవరు పుచ్చుకుంటారూ? అదిసరే తను ఇంటికి పోయిన తర్వాత భర్త 'కాంతమ్మగారు ఏమన్నా' దని తనను అడిగితే ఏమని సమాధానం చెప్తుంది

ఆచీరెను చూస్తుంటే దానిమీద పడి గట్టిగా ఏడవాలని పించింది కాంతమ్మకు. ★

**Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras.**

Regd. No. M. 4479.

త్వరలో వచ్చుచున్నది!

# కాంచనద్వీపం

రాబర్ట్ లూయీ స్టీవెన్సన్



అనువాదం:
నండూరి రామమోహనరావు

వెల రూ. 1-8-0

పోస్టుఖర్చులు ప్రత్యేకం

## ఆంధ్రగ్రంథమాల,

మద్రాసు 1.